# స్వప్నవాసవదత్తము

మహాకవి భాసకృతికి అనుకృతి

"కరుణశ్రీ"

జంధ్యాల పాపయ్యశాస్త్రి

కరుణశ్రీ కావ్యమాల

గుంటూరు

తృతీయ ముద్రణము
వెయ్యి ప్రతులు

ఫి బ్ర వ రి ౧౯౫౮

మూల్యము రు. ౧-౪-౦

జనరల్ ప్రింటర్సు,
గుంటూరు-2

# సుమాంజలి

ఈ కృతి భాసమహాకవి కృతికి అనుకృతి. రాజనీతి ధురంధరుఁడైన మహామంత్రి యౌగంధరాయణుఁడు వాసవదత్తను దాచి పద్మావతిని ఉదయనునకు వివాహముచేసి తన్మూలమున వత్సరాజ్యమును సుప్రతిష్ఠితముచేసిన కథ ఈనాటకమునందలి యితివృత్తము.

భాసకవి భవభూతి కాళిదాసాది కవిశిరోమణులకు నాటక రచనమున మార్గదర్శకుఁడై పేరెన్నిక గన్నవాఁడు. నాట్యకళా రహస్యజ్ఞుఁడు. సంస్కృతనాటక సాహితీ పితామహుఁడు.

ఈ మహాకవి రచించిన పదుమూఁడు నాటకములలో "స్వప్న వాసవదత్తము" మేలుబంతి. ఈ నాటకమును తెలుగులో అనువాదముచేసి ఆంధ్రసరస్వతి చరణములపై పూజాపుష్పముగా ఉంచుచున్నాను. అనువాదమందలి బాగోగులకు సహృదయ హృదయములే ప్రమాణములు.

రచయిత

# నాటకములోని పాత్రలు

| | |
|---|---|
| వాసవదత్త [అవంతిక] | అవంతీశ్వరుని పుత్రి. ఉదయనుని ప్రథమ పత్ని |
| పద్మావతి | మగధరాజపుత్రి. ఉదయనుని రెండవ పత్ని |
| ఉదయనుఁడు | వత్సదేశాధీశ్వరుఁడు |
| యౌగంధరాయణుఁడు | ఉదయనుని మహామంత్రి |
| వసంతకుఁడు | విదూషకుఁడు |
| బ్రహ్మచారి | లావాణక విద్యార్థి |
| కంచుకి | మగధదేశీయుఁడు |
| కాంచుకీయుఁడు | అవంతిదేశీయుఁడు |
| వసుంధర | వాసవదత్త దాది |
| మధుకరిక, పద్మినిక | పద్మావతి చెలులు |
| విజయ | ద్వారపాలకురాలు |

చేటి—తాపసి—రాజభటులు—దాది

# స్వప్నవాసవదత్తము

## ప్రథమాంకము

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సూత్ర :

*సవన వాసవదత్తాంగనా జనమ్ము,*
*ప్రియద పద్మావతీర్ణ పూర్ణము, విలాస*
*హిత వసంతక, ముదయనవ్యోందుకాంతి*
*భద్రమిడు మీకు బలభద్రబాహుయుగము.*

పూజ్యులగు సభ్యమహాశయులతో నే నీవిధముగా విజ్ఞప్తి చేయుచున్నాను. (ఆలకించి) ఇదియేమి! నేను విన్నవించుకొను నంతలో నేదియో సందడివలె వినవచ్చుచున్నది. పోనిమ్ము. అదేమో కనుగొందును.

[నేపథ్యమున]

తొలగిపొండి !! అయ్యలారా ! తొలగిపొండి !!

సూ: సరిసరి! తెలిసినది.

సారసపు మీఱ రాజకుమారి వెంట
నేగుదెంచెడు మగధరాజేంద్రు భటులు
పలుకుచున్నారు 'తొలఁగుఁడు! తొలఁగుఁ'డంచు
సత్తాపసులైన యాశ్రమజనుల నెల్ల.

[నిష్క్రమించును.]

ఇది స్థాపన

[ఇరువురు రాజభటులు ప్రవేశించుచున్నారు]

భ: తొలఁగిపొండి!! తొలగిపొండి!! అయ్యలారా తొలగిపొండి!!

[పరివ్రాజక వేషధారి యగు యౌగంధరాయణుఁడును, అవంతికావేషధారిణి యగు వాసవదత్తయును ప్రవేశించుచున్నారు]

యౌ: (ఆకర్ణించి) ఏమేమీ! ఇచ్చోట సైతము బహిష్కారము లేనా! కారణమేమో కాని.

ధీరులు, కందమూలపరితృప్తులు, వల్కలవాససుల్, మహా
దారులు మాన్యులైన జడదారులపై బెదరింపులా? బహి
ష్కారములా? చలద్విభవగర్వితుఁ డార్జవదూరుఁడౌ దురా
చారుఁ డెవండు సంతవలె నల్పు ప్రశాంత తపోవనాంతమున్?

వా: ఆర్యా! ఎవ్వఁ డీతఁడు? తొలగిపొమ్మంటున్నాడు.

జా : అమ్మా ! ఈతఁడు ధర్మపక్షమునుండి తన్ను దానే తొలఁగఁ ద్రోసికొనుచున్నాఁడు.

వా : ఆర్యా ! నే నా అభిప్రాయముతో మాటలాడటం లేదు. ఈనాటికి నేను సైతము తొలగిపోవలసినదాని నైనానుగదా అని విచారిస్తున్నాను.

జా : అమ్మా ! తెలియనప్పుడు దేవతలంతవారుగూడ తిరస్కారము బొందుదురు.

వా : ఆర్యా ! మార్గాయాసమునకన్న మరింత సంతాపకరముగా ఉన్నదీ అవమానము.

జా : అమ్మా ! ఈ ఐశ్వర్య విశేషము లన్నియు ననుభూత పూర్వములేగదా నీకు ! ఈ సందర్భమున సంతాప మందుట సముచితముగాదు తల్లీ !

ఉ॥ ఈ క్రియ మున్ను మీ రనుభవింపరె సంపదలెల్ల; భర్తృఁడో
ర్వీక్రమ లబ్ధ రాజ్య రమ వెండియు స్వాగతమీయడో ! జగ
చ్చక్ర సుఖాసుఖమ్ము లవి చక్రపుటాకుల భంగి వక్ర తా
లక్రమ పద్ధతిన్ దిరుగులాడు సదా పరివర్తితమ్ములై !

భ : తొలగిపొండి !! అయ్యలారా ! తొలగిపొండి !!

[అంతట కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కం : వలదు వలదు ! భటులారా ! వీరిని బహిష్కరింపవలదు.

రాజున కప్రతిష్ఠ గొనిరాకుఁడు! ప్రాప్తతపోధనుల్, క్షమా
భాజను లైన ఈ జనులపై పరుషత్వము సూపఁజెల్లునే?
రాజస భావ ప్రార్థ్య నగరమ్ముల బాధ భరింపఁజాలకే
యీ జనవారు లిట్లు వసియింత్రు వనమ్ములలో యథేచ్ఛగా.

భ: చిత్తము! చిత్తము!

[భటు లిరువురును నిష్క్రమింతురు.]

యౌ: (కంచుకిని గాంచి) ఆహా! ఈతఁ డెవ్వఁడో కడుంగడు వివేకవంతునివలెఁ గానవచ్చుచున్నాఁడు. అమ్మా! ఈయన సమీపమునకుఁ బోవుదము రమ్ము.

వా: మంచిది! నడవండి.

[ఇరువురును కంచుకిని సమీపించుచున్నారు.]

యౌ: (కంచుకితో) అయ్యా! ఈ యుత్సారణమునకుఁ గల కారణ మేమో యడుగవచ్చునా?

కం: తపోధనా! . . . . ఆలకింపుడు.

యౌ: (స్వగతము) "తపోధనా!" యను సంబోధనము చాల చక్కఁగ నున్నది. కాని యభ్యాసము లేకపోవుటచే నదేదో క్రొత్తక్రొత్తగా ననిపించుచున్నది.

కం : తపోధనా! ఆలకింపుడు. ఈమె మగధరాజనందన. ఆచార్యులచే నభిహితనామధేయుఁడైన దర్శకమహారాజుగారి సహోదరి; పేరు పద్మావతి. ఈ తపోవనమున నివసించుచున్న రాజమాత యగు మహాదేవిని సందర్శించి, పూజ్యురా లగు నామె యనుజ్ఞ నందుకొని, మరల రాజగృహమునకుఁ దిరిగిపోవు కోర్కెతోనిటువచ్చినది. మారాజపుత్రి యొకింతకాల మీయాశ్రమపదమున విశ్రమించి మిమ్ముల సమ్మానింప వేడుకపడుచున్నది. కావున మీ రందఱు-

*పూవులు దర్భలున్ సలిలముల్ సమిధల్ మఱి మీతపస్యకే*
*వేవి యభీష్టమో అవి యథేచ్ఛగ గైకొనుఁడయ్య! మా చిరం*
*జీవిని ధర్మశీల, వనసీమల మౌనుల మీద ధర్మవి*
*చ్ఛావము నోర్వఁదింతయు కులవ్రత మియ్యది రాకుమారికిన్.*

యౌ : (స్వగతము) ఓహో! ఈమెయా మగధరాజపుత్రి పద్మావతి! ఈమెనేకదా మా రాజేంద్రుఁడు రాణిగా గ్రహింపఁగలఁడని పూజ్యులైన పుష్పక భద్రాది దైవజ్ఞు లాదేశించియున్నారు. అవును వాస్తవమే-

*పరులయెడ ద్వేష మైన సద్భావ మైన*
*కలుగుచుండును సంకల్పబలమువలన;*
*ప్రభుకుటుంబిని యన్న సంబంధమహిమ*
*నీమెయందు సౌహార్దంబు హెచ్చె నాకు.*

వా : (స్వగతము) రాకుమారి యని ఆకర్ణింపగానే నా కీమెపై సోదరీభావ ముత్పన్న మౌతున్నది.

[అంత సపరివారయగు పద్మావతియు నామె చేటియు ప్రవేశించుచున్నారు.]

చేటి : రావమ్మా రాకుమారీ! ఈ యాశ్రమములోనికి పోదాము.

[ఆసీనురాలైన యొక తాపసి ప్రవేశించుచున్నది.]

తా : రాజపుత్రీ! స్వాగతము!

వా : (స్వగతము) ఈమెయే మగధరాజపుత్రి: ఆహా! ఈమె రూపము అన్వయగౌరవానికి అనురూపముగానే ఉన్నది.

ప : (తాపసికి నమస్కరించుచు) భగవతీ! ప్రణామములు!!

తా : చిరంజీవ! లోపలికి రావమ్మా అమ్మాయీ! లోపలికిరా! అతిథిజనముల కాత్మభవనములు గదా ఆశ్రమపదములు!!

ప : అలాగే! (లోనికి ప్రవేశించి) అదృష్టవంతురాలిని! భగవతి ఆదరాభిమానాలచే అనుగ్రహింపబడినాను.

వా : (స్వగతము) అందచందాలు మాత్రమే కాదు. ఈమె మాటలు సైతము మాధుర్యము ఒలకపోస్తున్నవి.

రా : (చేటితో) భద్రా ! మగధమహీపతి సోదరి యగు నీ తలోదరి యింతవఱకు ఏ నరపాలనందనుఁడును వరింపలేదా ?

చేటి : అమ్మగారూ ! ఉజ్జయినీ పట్టణము పరిపాలించే ప్రద్యోత మహారాజులుగా రున్నారే ఆయనగారు తమ అబ్బాయి కోసము రాయబారాలు జరుపుతున్నారండీ.

వా : (స్వగతము) ఇంకాయేం ! బాలాబాగున్నది ! ఈమె నాకు దగ్గరిచుట్టం కూడా కాబోతూ ఉన్నదన్నమాట !

ఆ : ఈమె యాకృతి ఇట్టి బహూకృతికి సర్వవిధముల సముచిత ముగ నున్నది. ఉభయ రాజవంశములును ఉన్నతములైన వనియే విన్నాను.

ప : (కంచుకితో) అయ్యా ! అభీష్టవస్తువులు అందుకొని, ఆశీస్సులు అనుగ్రహించటానికి తపస్విజను లెవరున్నా దయచేయలేదా ? అడిగినవస్తువులు ఇస్తామని అందరినీ ఆహ్వానించండి ! ఎవరికి ఏమికావాలో కనుక్కోండి !

కం : తల్లీ ! తమ యిష్టానుసారమే చేయుదును. (ఎలుగెత్తి) ఆశ్రమవాసు లగు నో తపోధనులారా ! ఆలకింపుఁ డాలకింపుఁడు !! మాననీయ యగు మగధరాజనందన మీ సౌజన్యము

నందలి శ్రద్ధాభక్తులతో ధర్మార్థమై దానములిచ్చి మిమ్ము సమ్మానింప సంకల్పించినది. కావున-

*కలశంబుల్ గ్రహియింతురో, వలువ లాకాంక్షింతురో, బ్రహ్మచా*
*రులు పఠాంతర బహూకృతుల్ గురుల కేయూపాన నీ నెంతురో,*
*తెలుపుం! డెవ్వరి కేవి కాంక్షితము, లార్ద్రీభూతచేతస్క, ని*
*ర్మలధర్మాత్మ, నరేంద్రపుత్రి యిడు నాత్మానుగ్రహప్రాప్తికై.*

యౌ : (స్వగతము) అమ్మయ్య! మంచి యవకాశము లభించినది. (ప్రకాశము) ఇదిగో! నేను యాచించుచున్నాను.

వ : ధన్యురాలిని! నా తపోవనాగమనం సార్థకమైనది.

తా : ఈ యాశ్రమమునందలి తపస్విజనము సర్వదా సంతుష్టము. ఈతఁ డెవ్వఁడో యాగంతుకుఁడు కాఁబోలు!

కం : (యౌగంధరాయణునితో) తపోధనా! తమరేమి వాంఛించుచున్నారు?

యౌ : (వాసవదత్తను చూపించుచు) ఇదిగో! ఈమె నా సహోదరి. ఈమె పేరు అవంతిక. ప్రోషితభర్తృక యగు నీమెను పూజ్యురాలైన మీ భూపాలపుత్రి కొంతకాలము తనవెంత నుంచుకొని రక్షణభారము వహింపవలె నని ప్రార్థించుచున్నాను. ఇదియే నా వాంఛితము.

ఒల్లను వస్త్రముల్; ధనము లొల్లను; భోగము లొల్ల; భక్తికై
కల్లరి కావిపట్టములు గట్టి చరించెడి వాఁడఁగాను; నా
వెల్లలి శీల రక్షణము సేయ నుదార గుణాఢ్య కీమెకే
వెల్లు నటంచు, సరమతి శ్రీమతి నిట్లు సమాశ్రయించితిన్.

వా : (స్వగతము) అమ్మయ్యో! ఇదేమిటీ? ఆర్య యౌగంధ రాయణులు నన్నీమె దగ్గర దాచిఉంచవలెనని తలంచు తున్నారు. సరే! మహామాత్యులవారు అనాలోచితంగా ఏ కార్యమూ సంకల్పించరు.

కం : (పద్మావతితో) అమ్మా! ఈయన కాంక్షితము కడుంగడు భారముగాఁ గాన్పించు చున్నది. దీని నంగీకరించుట యెట్లు? ఏమందురా-

ధనము లివచ్చు! ఈవచ్చు తపములైన!
హాయిగా ప్రాణములె ధారపోయవచ్చు!
వసుధ నేమేనియుం జేయవచ్చుఁ గాని
పర ధనమ్ములు దాచి కాపాడలేము.

ప : అయ్యా! ఎవరేది కోరితే వారి కది ప్రదానం చేస్తామని ప్రథమంలో ప్రకటించి, యిప్పు డీ విధంగా వెనుకంజ వేయటము భావ్యం కాదు. కనుక వారి యిష్టానుసారమే కానీయండి.

కం : అమ్మా! తమ యోగ్యతకు తగినట్లే పల్కితిరి.

చేటి : ఆడినమాట చెల్లించుకో గలిగినందుకు అమ్మాయిగారు వంద సంవత్సరాలు వర్ధిల్లండి!

తా : చిరంజీవినీ భవ! చిరంజీవినీ భవ!

కం : తథాస్తు! (యౌగంధరాయణునితో) ఆర్యా! మీ సోదరి పరిపాలన భారమును పూజ్యురాలైన మా భూపాలపుత్రి వహించినది.

యౌ : మహాప్రసాదము! (వాసవదత్తతో) అమ్మాయీ! నీ యజమానురాలి యొద్ద కేగుము.

వా : (స్వగతము) ఇక మార్గాంతరం ఏమున్నది? మందభాగ్యురాల నైనాను. (ప్రకాశము) ఇదిగో! వెళ్లుతున్నాను. (పద్మావతి సమీపమున కేగును.)

ప : అమ్మా! నీ విప్పుడు నా కాత్మీయురాల వైనావు.

తా : (వాసవదత్తను సమీక్షించి) ఆహా! ఏమి యీ రూపరేఖా విలాసము! చూచిన కొలది ఈమె నైతము రాచకన్నె యని తోచు చున్నది.

చేటి : అమ్మగారు చక్కగా సెలవిచ్చారు. ఒకప్పుడు ఈమెగారు కూడా సిరిసంపదలతో తులతూగే ఉంటారని నా అనుమానం.

యౌ : (స్వగతము) అమ్మయ్య! సగము భారము తగ్గినది. సరిగా మంత్రులతో నాలోచించినట్లే కార్యము సానుకూల మగుచున్నది.

ఉదయన మహారాజు అఖండ రాజ్యరమా ప్రతిష్ఠితుఁడైన యనంతరము దేవిగారిని తిరిగి తీసికొని పోవునప్పు డీ మగధ రాజపుత్రి మాకు విశ్వాసస్థానము కాఁగలదు. ఎందులకన-

రాజ్ఞి యగుఁ గా యథార్థముగ రాజున కీ మగధేంద్ర పుత్రి పై
వజ్ఞులు పల్కినట్లు; గడవం దరమే విధికైన సిద్ధులౌ
ప్రాజ్ఞులసూక్తి; మొన్న పలుబాములనందఁడె స్వామి; కేమికి
యజ్ఞ ముపక్రమించితి, మహాత్ముల మాటలు విశ్వసించితే.

[ఒక బ్రహ్మచారి ప్రవేశించును.]

బ్ర: (ఆకాశము నాలోకించి) అబ్బా! మధ్యాహ్న మైనది. ఆయాస మధికముగ నున్నది. ఎచ్చటనైన కొంచెము విశ్రమించవలెను. ఇదేదో తపోవనము వలెఁ గన్పించు చున్నదే! వాస్తవమే-

లేడి పిల్లలు చెంగలించు మైమఱచి మ
చ్చిక మీఱ క్రొత్త పచ్చిక బయళ్ళ!
పాదపమ్ములు పుష్పఫల భారమున వంగి
స్వాగత మ్మొసఁగు నభ్యాగతులకు!
కపిల గోవులు హాయిగా పండుకొన్నవి
నెమరు వేయుచు చెట్లనీడలందు!
మధ్యాహ్న హోమధూమాలు నల్ ప్రక్కల
క్రమ్మిన వాజ్య గంధమ్ము నూని!
సహజ కోమల శాద్వలస్థలులె కాని
కనుల కగపడ వెచట దున్నిన పొలాలు;
ఎల్లయెడల దాక్షిణ్యమ్ము వెల్లివిరియు
నగు నిది తపోవనము సందియమ్ము లేదు.

లోనికి బ్రవేశింతును. (ప్రవేశించి కంచుకిని గాంచి) ఈతఁ డెవ్వరో ఆశ్రమ విరుద్ధముగ నున్నాఁడు. (మఱియొక వైపు చూచి) ఇచ్చట మునిజన మున్నది. తప్పులేదు; సమీపించ వచ్చును. (పరిక్రమించి) అయ్యో! స్త్రీజనము!

కం: అయ్యా! అభ్యంతరము లేదు మీరు స్వేచ్ఛగ లోనికి రావచ్చును. ఆశ్రమ పదములు సర్వజన సాధారణములు!

వా: అయ్యో......

ప:(స్వగతము) ఓహో! ఈమె పరపురుష సందర్శనాన్ని పరిహరిస్తున్నది. సరే. ఈమె నా న్యాసము. ఈమెను జాగ్రత్తగ సంరక్షించే బాధ్యత నాదే.

కం: (బ్రహ్మచారితో) అయ్యా! మీకంటె ముందుగ నిందు మేము ప్రవేశించితిమి. కావున మా యాతిథ్యము నందుకొనుఁడు.

(అర్ఘ్యపాద్యము లిచ్చును.)

బ్ర: (అందుకొని) ఆహా! మార్గాయాస మంతయు క్షణములో దీరిపోయినది.

యౌ: ఆర్యా! ఎచ్చట నుండి వచ్చుచున్నారు? ఎచ్చటికిఁ బోయెదరు? మీ నివాస మెచ్చట?

బ్ర: అయ్యా! ఆలింపుఁడు. రాజగృహము నుండి నారాక. వేదాధ్యయ నార్థము వత్స దేశము నందలి "లావాణకము"లో నివసించుచుండెడివాఁడను.

వా : (స్వగతము) ఏమీ! లావాణకమా! అహో! లావాణక సంకీర్త నముచే నా దుఃఖం మళ్ళీ తలయెత్తుతున్నది.

యౌ : మరి శాస్త్రాధ్యయనము సంపూర్ణమైనదా?

బ్ర : ఇంకను కాలేదు.

యౌ : చదువు సమాప్తము గాకుండ బయలు దేరుటలోఁ గల ప్రయోజనము?

బ్ర : అక్కడ అతిభయంకరమైన యాపద సంభవించినది.

యౌ : అదేమి?

బ్ర : లావాణకములో ఉదయనుఁడను మహారాజు ఉన్నాడు.

యౌ : ఔను. పూజ్యులైన ఉదయనులవారిని గూర్చి వినియున్నాము. వారికేమి?

బ్ర : ఆయనకు అవంతిరాజనందన వాసవదత్త యను ప్రాణసమాను రాలగు పత్ని గలదు.

యౌ : ఉండవచ్చు! తరువాత—

బ్ర : మహారాజు మృగయావినోదార్థము అరణ్యమున కరిగియున్న సమయమున లావాణకము దగ్ధమైనది. వాసవదత్తయు నందే దగ్ధమైపోయినది.

వా : (స్వగతము) అసత్యము ! అసత్యము ! అభాగ్యురాలను బ్రతికే ఉన్నాను.

యౌ : (బ్రహ్మచారితో) అనంతరము—

బ్ర : అనంతరము రాణిగారిని రక్షించు నిమిత్తము ప్రయత్నించి యౌగంధరాయణుండను మహామంత్రి సైత మా మంటలలోఁ బడిపోయినాఁడు.

యౌ : పడిపోయినాఁడా ! పాపము ! ఆ తరువాత -

బ్ర : తరువాత నరణ్యము నుండి తిరిగివచ్చిన మహారాజా వృత్తాంత మంతయు నాలించి, ప్రియజన వియోగ సంతాపమును సహింపలేక ఆ యగ్నిలోనే పడి ప్రాణములు పరిత్యజింపఁ బ్రయత్నించెను. కాని ఆయన మంత్రు లతికష్టముపై నివారించిరి.

వా : (స్వగతము) ఎరుగుదును ! ఆర్యపుత్రులకు నాయందున్న అనురాగము ఎటువంటిదో బాగుగా ఎరుగుదును.

యౌ : దగ్ధావశేషములైన దేవిగారి యాభరణముల నాలింగనము చేసికొని మహారాజు మూర్ఛాక్రాంతుఁ డయ్యెను.

వా : (స్వగతము) మహామంత్రులవారి మనోరథము ఇప్పటికి సిద్ధించినది. (కన్నీరు నించును)

చేటి : (పద్మావతితో) భర్తృదారికా ! ఈ అమ్మగారు ఏడుస్తున్నా రమ్మా ! ఎందుకో ?

పద్మా : పాపం ! చాలా సుతిమెత్తని హృదయమే ఈమెది !

యౌ : ఔనౌను ! సహజముగానే జాలిగుండె నా సహజన్మురాలిది. (బ్రహ్మచారితో) అయ్యా ! అనంతర మేమి జరిగినది ?

బ్ర : అనంతరము ఉదయనులవారికి మెల్లిమెల్లిగా తెలివి వచ్చినది.

పద్మా : (స్వగతము) అమ్మయ్య ! బ్రతికాను. మూర్ఛాక్రాంతులైనా రనగానే నా హృదయమే శూన్యమైనట్లు తోచింది.

యౌ : (బ్రహ్మచారితో) ఆతరువాత-

బ్ర : తరువాత మహారాజుగారు ధూళిధూసరిత శరీరులై భూమి మీద నుండి చివాలున లేచి 'హా ! వాసవదత్తా ! హా ! అవంతిరాజపుత్రీ ! హా ! ప్రియురాలా ! హా ! ప్రియశిష్యురాలా !' యని ఏమేమో ప్రలపించుచు నెన్నియో విధముల విలపించిరి. పెక్కు పలుకు లెందుకు—

*జంటలు వాసి గానివడు జక్కవలం గనలేదొ ! కూర్మి వా*
*ల్గంటులఁ బాయువల్లభుల గాంచమొ! ఈదృశదుఃఖమెచ్చటేఁ*
*గంటిమొ? అంతప్రేమ సతిపైకొను కెంతయదృష్టి! యామెకేఁ*
*మంటలమ్రగ్గియుఁ నిజము! మ్రగ్గనిదె పతి కూర్మిపెంపునఁ.*

యౌ : అయ్యా! ఉదయనులవారి సోదార్పుటకై యొక్క మంత్రి యును బ్రయత్నింపలేదా?

బ్ర : లేకేమి! రుమణ్వంతుడను నమాత్య శేఖరుడు మహారాజు నూరడించుటకై బహువిధంగుల ప్రయాస పడుచున్నాడు. ఆ మంత్రి మహాశయుడు—

ఛాయవలెఁ బవళ్ళును నిశల్ వెనువెంటఁ జరించు, నన్నపా
నీయములొల్లఁ, డశ్రుమయనేత్రుఁడసంస్కృతగాత్రుఁడై బహూ
పాయములన్ నృపాలునకుభద్రము సేయుచునుండు, లోకులా
హా యన స్వామి ప్రాణములకై తనప్రాణము లీయ సిద్ధమై.

వా : (స్వగతము) అదృష్టవశముచేత ఆర్యపుత్రులు సురక్షితులైనారు.

యౌ : (స్వగతము) పాపము! రుమణ్వంతుడు గొప్ప భారము వహించుచున్నాడు. ఏలయన—

నాకు విశ్రాంతి యన్న దున్నది రవంత,
లేదు విశ్రాంతి యతనికి లేశమేని;
నిజము సర్వంసహా భర్తనే భరించు
వాని కష్టాలు తెలుప నెవ్వాని వశము !!

(ప్రకాశము) అయ్యా! మహారాజుగారి మానస మీపాటికి కుదుట పడి యుండునా?

బ్ర : ఇప్పటి సంగతి నాకు తెలియదు. 'ఇదిగో ! ఇచ్చట పేమిరు పురము నవ్వుకొంటిమి; ఇచ్చట మాటలాడుకొంటిమి; ఇచ్చట కూర్చుంటిమి; ఇచ్చట ప్రణయకోపము వహించితిమి; ఇచ్చట శయనించితి' మని విరహాతిశయముచే విలపించుచున్న రాజు గారిని మంత్రు లందఱు పట్టుపట్టి బలవంతముగా నచ్చట నుండి యెచ్చటికో కొనిపోయిరి. ఇట్లు సపరివారముగ రాజు వెడలి పోవుటచే నక్షత్రములును చంద్రుఁడు లేని నభోమండలము వలె నా గ్రామము కాంతివిహీన మయ్యెను. అందుచే నేను సైత మచ్చట నుండి లేచివచ్చితిని.

తా : ఆగంతుకులచే సైత మింతగా కీర్తింపఁబడు నా మహారా జెంతటి గుణవంతుఁడో !

చేటి : (పద్మావతితో మెల్లగా) మళ్ళీ ఆ మహారాజుగారి చేయి పట్టు కుండే భాగ్యము ఏ రాకుమారి నుదుట రాసిపెట్టి ఉందో !

ప : (స్వగతము) నా మనస్సులోని ఆలోచన కూడా సరిగా ఇదే !

బ్ర : సెలవిండు. నేను పోయివత్తును.

యౌ : } మంచిది వెళ్ళిరండి !
కం : }

[బ్రహ్మచారి నిష్క్రమించుచున్నాఁడు.]

బ్ర : పూజ్యురాలైన రాజపుత్రి సెల విచ్చినచో నేనును పోయి వచ్చెదను.

కం : (పద్మావతితో) అమ్మా ! తమ యనుజ్ఞ గైకొని ఈయన వెడలఁ దలఁచియున్నారు.

ప : అన్నగారి వియోగానికి అనుగుచెల్లి ఎంత దిగులుపడుతుందో !

బ్ర : సజ్జన సాంగత్యము లభించిన నా సహోదరికి ఏ దిగులును నుండదు. (కంచుకితో) ఆర్యా ! సెలవు !

కం : త్వరలో పునర్దర్శన మగుఁగాక !

బ్ర : తథాస్తు !

[యౌగంధరాయణుఁడు నిష్క్రమించుచున్నాఁడు.]

కం : అమ్మా ! అంతఃపురమున కేగు సమయ మాసన్నమైనది.

ప : (తాపసితో) పూజ్యురాలా ! నమస్కారాలు !

(నమస్కరించును.)

తా : అనురూపుఁడైన భర్త లభించుఁగాక !

వా : భగవతీ ! ప్రణామములు !

తా : అచిరకాలములో భర్తృ సందర్శన భాగ్యము ప్రాప్తించుఁగాక!

వా : మహాప్రసాదము !

కం : అమ్మా ! ఇక బయలుదేరుఁడు, ఇటు ! ఇటు ! అహో ! సంధ్యా సమయ మెంత హృదయంగమము—

వచ్చు చున్నవి నిజావాసమ్ములకు రెక్క
లాడించు కొనుచు విహంగతతులు !
స్నానాలు చేయుచున్నారు తపస్విత
ల్లజులు కెంగావి చేలములు గట్టి !
వెలుగుచున్నవి సముజ్జ్వల సమిచ్చయములై
యగ్నులు పర్ణశాలాంగణముల !
ప్రాకుచున్నవి చెట్లపై కల్లనల్లన
హోమ సౌరభవాహి ధూమలతలు !

పగ్గములు వేయికరముల బిగ్గపట్టి,
సప్తహయముల నాపి: పడమటి కొండమీది
స్యందనము దూకి లోనికిఁ జనెడు నదిగో !
మెల్లమెల్లఁగ పద్మినీవల్లభుండు !!!

[అందఱు నిష్క్రమించుచున్నారు]

# స్వప్నవాసవదత్తము

## ద్వితీయాంకము

[చేటి ప్రవేశించుచున్నది.]

చేటి : కుంజరికా! కుంజరికా! భర్తృదారిక పద్మావతమ్మగారు ఎక్కడున్నారే? (ఆలకించి) ఏమిటి? ఏమంటున్నావు? మాధవీ లతామండపము దగ్గర బంతి ఆడుకుంటూ ఉన్నారా? సరే! నేనామె దగ్గరకు వెళ్ళుతున్నాను. (పరిక్రమించి ముందుకు చూచుచు) అదుగో పద్మావతమ్మ! బంతి ఆడుతూ ఇటే వస్తున్నారు. చెవిలోని నల్ల కలువ పూవు జారిపోతూ అలిసిపోయిన ఆ ముఖం ఎంత అందంగా ఉన్నది! ఆ ముద్దుల ముఖం మీద ముత్యాలవంటి స్వేదబిందువులు కన్నులపండువు చేస్తున్నవి! దేవిగారి సమీపానికి వెళ్ళుతాను.

[నిష్క్రమించుచున్నది.]

[కందుక క్రీడా పరాయణయగు పద్మావతి, వాసవదత్త తోడను సఖీజనము తోడను, ప్రవేశించుచున్నది.]

వా : అమ్మా! ఇదుగో మీ కందుకము!

ప : మీ దగ్గరే ఉంచుకోండి. ఈ పూటకు ఆట ఆపివేద్దాము.

వా : ఇదుగో చూచారా! ఇప్పటి వరకూ కందుక క్రీడ గావించిన కారణము చేత సంజాత రాగములైన ఓ కర కంజాతములు క్రొత్త క్రొత్తగా కనుపించుతున్నవి.

చేటి : ఆడుకోండి అమ్మాయిగారు! అప్పుడే ఆట ఆపివేశారేం? ఆటలూ పాటలూ అన్నీ ఈ కన్నె ప్రాయములోనే కదా!

ప : (వాసవదత్తతో) ఏమిటండీ నా వైపు ఏదో వేళాకోళముగా చూస్తున్నారు?

వా : లేదు లేదమ్మా! ఈ రోజు ఎప్పటి కంటె మరింత మనోహరముగా కనుపించుతున్నారు మీరు. ఈనాడు మీ ప్రియముఖ సందర్శనం.........

ప : చాలులెండి! మీ పరిహాసాలూ మీరూ!

వా : నిజమేలెండి! మీతో మాకు పరిహాసా లేమిటి! మీరు మహాసేనుల వారికి కాబోయే కోడళ్ళు!

ప : మహాసేనుల వా రెవరండోయ్?

వా : ఉజ్జయినీశ్వరులు ప్రద్యోత మహారాజుగారు. ఆయన గారికి అంతులేని సేన ఉండటము వల్ల మహాసేను లని పిలుస్తారు.

చేటి : మా రాకుమారికి ఆ రాజుకొడుకును చేసికోవటం ఏమాత్రం ఇష్టము లేదండీ !

వా : అయితే ఇంకెవరిని వివాహ మాడుతుంది ?

చేటి : ఉన్నారులే, వత్స దేశాధీశ్వరులు ఉదయనుల వారు. ఆయన గుణ సంపదలు ఆలకించి నప్పటి నుంచి అమ్మాయిగారి మనస్సు అటే లగ్నమైంది.

వా : (స్వగతము) ఏమిటేమిటి ? ఆర్యపుత్రులనే అభిలషించిందే ఈమె ! (ప్రకాశము) ఏమిటో విశేషము ?

చేటి : ఆయనగారు చాలా దయార్ద్రహృదయులని.

వా : (స్వగతము) అవునవును ? నేను కూడ ఈ విధముగా వెఱ్ఱి త్తిన దానినే !

చేటి : (పద్మావతితో) భర్తృదారికా ! ఆయనగారు ఒక వేళ అంద గాడు కాకపోతే ?

వా : కాకపోవట మేమిటే ? ఆయన చాలా చక్కనివారు !

ప : ఆ సంగతి మీ కేవిధముగ తెలుసునండీ ?

వా : (స్వగతము) అయ్యో ! ! ఆర్యపుత్రుల మీది అనురాగాతిశయం కొద్దీ మర్యాద దాటి మాటలాడాను. ఇప్పుడేమి చేసేది ? సరే !

(ప్రకాశము) ఈ విధముగా ఉజ్జయిని లోని జనులు చెప్పు కుంటారమ్మా!

ప : వాస్తవమే కావచ్చు! ఉజ్జయినిలో ఆయనను ఎరుగనివా రెవ రుంటారు. సౌభాగ్యసంపద సర్వజనహృదయంగమం గదా!

[అంత దాది ప్రవేశించుచున్నది.]

దాది : జయము జయము రాకుమారి గారికి! మీకు పెండ్లి సంబం ధము కుదిర్చారమ్మా!

వా : పెండ్లికుమారు డెవరమ్మా?

దా : వత్సరాజు ఉదయనులవారమ్మా!

వా : ఆ రాజుగారు క్షేమముగా ఉన్నారా?

దా : ఆహా! ఆయనగారు సురక్షితముగా ఇప్పటికి వచ్చేచారు. పద్మావతమ్మ గారిని పాణిగ్రహణము చేసికోటానికి ఇష్టపడ్డారు కూడాను.

వా : అన్యాయము! అన్యాయము!

దా : అన్యాయ మేముందమ్మా ఇందులో?

వా : మరేమీ లేదు. అప్పుడు ఆ విధంగా పరితపించి, ఇప్పు డీ విధ ముగా మారిపోయినాడేమా అని.

దా : పూజ్యురాలా! మహాపురుషుల మానసములు ఆగమ ప్రధానములు? సులభపర్యవస్థానములు గదా!

వా : అయితే అమ్మా! వారే స్వయముగా ప్రేమించి వరించారా?

దా : లేదు లేదమ్మా! ఆయన ఏదో వేరే పనిమీద ఇచ్చటకు వచ్చారట! వారి వంశగౌరవమూ, రూప సంపదా, సుగుణ పరంపరా చూచి స్వయముగా మన మహారాజుగారే అమ్మాయిగారిని వాగ్దానము చేశారు.

వా : (స్వగతము) అయితే ఇందులో ఆర్యపుత్రుల అపరాధం లేదు.

[మఱియొక చేటి ప్రవేశించుచున్నది.]

చేటి : అమ్మా : రండి రండి! మిమ్ము పెండ్లికూతురిని చేయటానికి మహారాణిగారు తొందరపడుతున్నారు.

వా : (స్వగతము) వీరు తొందర పడుతున్న కొద్దీ నా హృదయములో అంధకారము ఆవరిస్తున్నది.

దాది : లేవండి అమ్మాయిగారూ! వెళ్ళుదాము!

[అందరు నిష్క్రమించుచున్నారు.]

# స్వప్న వాసవదత్తము

## తృతీయాంకము

[చింతాక్రాంత యైన వాసవదత్త ప్రవేశించును.]

వా : వివాహ మహోత్సవ సంతోషములో మునిగిపోయి ఉన్న అంతఃపుర చతుశ్శాలలో పద్మావతిని వదలిపెట్టి ఈ పూలతోట లోకి వచ్చేశాను. ఇక్కడ ఏకాంతముగా కూర్చుండి దుర దృష్టము వల్ల ప్రాప్తించిన దుఃఖాన్ని దిగమింగుకుంటాను. (ముందుకు పరిక్రమించి) ఆహా! ఎంత దారుణము! ఆర్య పుత్రులు నే డీవిధముగా అన్యాక్రాంతు లైపోతా రని అను కోలేదు. (కూర్చుండి) ఆ చక్రవాకకాంత ఎంతటి ధన్యురాలు! అది జంట వీడి జీవించనే లేదట! ఇక నేనో! ఇప్పటికీ ఈ మొండి ప్రాణాలు విడువ లేకున్నాను. అభాగ్యురాలను! ఆర్య పుత్రుణ్ణి అవలోకించగలననే ఆశతో బ్రతుకుతున్నాను.

[చేటి పువ్వులతో ప్రవేశించుచున్నది]

చేటి : ఆవంతికమ్మగారు ఎక్కడున్నారో! (పరిక్రమించి ఆలో కించి) ఇదుగో! ఇక్కడ ఈ ప్రియంగు వృక్షము క్రింది శిలా

ఫలకము మీద కూర్చున్నారు. పాపం! ఏదో చింతతో చిన్న బోయి ఉన్నారు. ఆహా! ఈమె ఆకారము అలంకారశూన్యమై మంచు కప్పిన చంద్రరేఖ వలె ఉన్నది. సమీపిస్తాను. (సమీపించి ప్రకాశముగ) అవంతికమ్మగారూ! మీ కోసము చాలసేపు నుంచి వెదకుతున్నాను.

వా : ఎందులకే ?

చేటి : మీరు సద్వంశ సంజాతలనీ, శిల్పకళా చాతుర్యము కలవారనీ, అనురాగమయహృదయలనీ ఈ కల్యాణ కౌతుక మాలికను మీ చేతనే కట్టిస్తే బాగుంటుందని మా మహారాణిగారు నన్ను ఇక్కడికి పంపారమ్మా!

వా : ఎవరికే ఈ మాలిక ?

చేటి : మన పద్మావతమ్మ గారికే నమ్మా!

వా : (స్వగతము) ఈ పని కూడ నామీదే పడిందా: అహా! భగవంతుడు నైతము పగ సాధిస్తున్నాడే.

చేటి : అమ్మగారు ఏమిటి ఆలోచిస్తున్నారు ? అదుగో! చూడండి! అప్పుడే పెండ్లికుమారుడు గారిని మంగళస్నానము చేయించటానికి మణిమయ మంటపములోనికి తీసుకుపోతున్నారు. మీరు తొందరగా పూలమాల పూర్తి చేయండి.

వా : (స్వగతము) ఆలోచించే శక్తి కూడా ఉండా ఈ హృదయానికిప్పుడు! (ప్రకాశము) చేటీ! పెండ్లికుమారుడు గారిని నీవు చూచావుటే ?

చేటి : చూచానమ్మా చూచాను! మన పద్మావతమ్మ భర్తగారనే కుతూహలముతో మరీమరీ చూచాను.

వా : ఎలా ఉన్నారే ఆయన ?

చేటి : ఏం చెప్పమంటారు! అటువంటి వారిని ఎప్పుడూ ఎక్కడా నేను చూడలేను.

వా : స్పష్టముగా చెప్పు! చక్కనివారేనుటే ?

చేటి : విల్లూ బాణమూ విడిచిపెట్టిన మన్మథుడేనమ్మా!

వా : ఇక చాలులేవే!

చేటి : ఇదేమిటమ్మా! చాలునంటున్నారు ?

వా : పర పురుష సంకీర్తన శ్రవణము పాపము కాదుటే!

చేటి : సరే! వేగిరము మాలిక గ్రుచ్చి ఈయండి! వెళ్లుతాను.

వా : ఇదిగో! గ్రుచ్చుతున్నాను. పూలు అందించు!

చేటి : చిత్తము! (పూలు అందించుచుండును)

వా : (పైకితీసి పరీక్షించుచు) ఈ ఓషధి పేరేమిటే ?

చేటి : అది "సౌభాగ్యవర్ధన" మమ్మా!

వా : (స్వగతము) అయితే ఇది నా కోసమూ మాపద్మావతి కోసమూ తప్పక గుచ్చ వలసిందే (మరియొకటి తీసి, ప్రకాశముగ) ఇదిగో ! ఈ ఓషధి ఏమిటే ?

చేటి : దీని పేరు "సపత్నీమర్దన" మమ్మా !

వా : అయితే ఇది గ్రుచ్చ వలసిన అవసరము లేదులే !

చే : ఎందువల్లనమ్మా ?

వా : వారి మొదటి భార్య మరణించింది కాదుటే ! అందువల్ల ఇది అనవసర మంటున్నాను.

[మఱియొక చేటి ప్రవేశించుచున్నది)

చేటి : అమ్మా ! త్వరపడండి ! త్వరపడండి ! అదుగో ! అప్పుడే పెద్ద ముత్తైదువలు పెండ్లికొడుకు గారిని అభ్యంతర చతుశ్శాల లోనికి తీసికొని పోతున్నారు.

వా : సరే ! ఇదుగో ! మాలిక తీసికొనిపో ! (ఇచ్చును)

చేటి : మంచిదండి అమ్మగారు ! వెళ్ళి వస్తాము.

[ఇరువురు చేటులును నిష్క్రమించుచున్నారు]

వా : వెళ్ళిపోయినారు ! ఆహా ! ఎంత పని జరుగుతున్నది ! ప్రాణేశ్వరులు పరకీయులై పోతున్నారు. ఇంకేముంది ! గదిలోకి వెళ్ళి పడుకుంటాను. నిద్రపట్టితే కొంత ఈ హృదయ భారము తగ్గుతుందేమో !

[నిష్క్రమించుచున్నది]

# స్వప్నవాసవదత్తము

## చతుర్థాంకము

[వసంతకుడు ప్రవేశించుచున్నాడు]

వసం : (సంతోషముతో) భగవంతుని అనుగ్రహం వల్ల మా ఉదయన మహారాజుల వివాహమహోత్సవ సమయం కోరుకున్నట్లు వచ్చింది. దాట శక్యంగాని కడగండ్లనే సుడిగుండాలలో పడి మళ్ళీ ఈవిధంగా బ్రతికి బయటపడతామని అనుకోలేదు. ఆ కష్టకాల మంతా గడచిపోయింది. ఇప్పుడు ఉన్నత ప్రాసాదాలలో నివసిస్తున్నాము. అంతఃపురపు దిగుడు బావులలో స్నానం చేస్తున్నాము. పుట్టుక తోనే మధురములైన మెత్తని లడ్డుముద్దలు భుజిస్తున్నాము. అప్సరసల సంబంధం లేని ఉత్తర కురుదేశాలలో ఆనందం అనుభవిస్తున్నాము. అన్నీ బాగానే ఉన్నవి. కాని ఒక్కటి మాత్రం పెద్ద చిక్కుగా ఉన్నది. తిన్న తిండి చక్కగా జీర్ణానికి వచ్చి ఒంట పట్టడం లేదు. మెత్తని పట్టు పరువుల మీద కూడా నిద్ర పట్టడం లేదు. నాకు చూడగా ఏదో వాతరోగం ప్రవేశించినట్లు అనుమానంగా ఉన్నది. అనారోగ్యముతో కూడిన సుఖం సుఖం కాదుగదా!

[అంతట చేటి ప్రవేశించుచున్నది]

చేటి : వసంతకయ్యగారు ఎచ్చటికి పోయినారో! (పరిక్రమించి, ముందుకు చూచి) ఇదుగో వసంతకయ్యగారు! (సమీపించి) ఏమండీ! ఎక్కడికి పోయినారు? ఎంతకాలం నుంచి వెదకుతున్నానయ్యా నీ కోసం?

వసం : నా కోసమే! ఏమిటి విశేషము?

చేటి : అల్లుడుగారు స్నానం చేశారేమో తెలుసుకు రమ్మన్నారు మా మహారాణిగారు.

వసం : ఎందుకోసమో?

చేటి : మరేమి లేదు. పూల దండలూ మంచి గంధమూ పట్టుకొని వస్తామని.

వసం : మహారాజు గారు స్నానం చేశారు. ఇక నీవు సమస్తమూ తీసికొని రావచ్చు. ఒక్క భోజనం మాత్రం వద్దు.

చెటి : అదేమి! భోజనం వద్దంటున్నారు!

వసం : కోకిలలకు అక్షిపరివర్తం లాగా నిర్భాగ్యుడనైన నాకు కుక్షిపరివర్తం సంభవించింది.

చేటి : (నవ్వుచు) నీకు అంతే కావాలి.

వసం : ఇక తమరు దయ చెయ్యండి. నేను కూడా మా మహారాజు గారి సమీపానికి వేంచేస్తున్నాను.

[ఇరువురు నిష్క్రమించుచున్నారు]

[ఇది ప్రవేశకము]

[అంత సపరివారయైన పద్మావతి అవంతికా
వేషధారిణియైన వాసవదత్తతో ప్రవేశించును]

చేటి : భర్తృదారికా! ఇప్పుడు మనము ప్రమదావనంలో ప్రవేశించినాము.

ప : చేటీ! ముద్దుగా పెంచుకుంటూ ఉన్న శేఫాలికలు పూలు పూచాయో లేదో చూతాము!

చేటి : రాకుమారీ! శేఫాలికలు పుష్పించినవమ్మా! అవిగో పగడాలు పొదిగిన ముత్యాల దండల వలె ఈ పుష్పాలు ఎంత మనోహరంగా ఉన్నవో చూడండి!

ప : అయితే ఇంకా ఆలస్యం దేనికి?

చేటి : భర్తృదారికా! ఒక్క ముహూర్తకాలం మీరీ శిలాఫలకం మీద కూర్చుండండి! నేను పూలు కోస్తాను.

ప : (వాసవదత్తతో) ఏమమ్మా! అవంతికా! ఇక్కడ కూర్చుందామా?

వా : మీ ఇష్టప్రకారమే!

[ఇరువురు శిలాఫలకముపై కూర్చుందురు]

చేటి : (పూల దోసిలి చూపుచు) అమ్మా! ఇటు చూడండి! మణిశిల

కణికల మాదిరిగా ఈ శేఫాలికలు నా చేతుల్లో ఏ విధంగా ప్రకాశిస్తున్నవో!

ప: (చూచి) ఆహా! ఎంత మనోహరంగా ఉన్నవి! (వాసవదత్తతో) అమ్మా! చూడండి! చూడండి!

వా: అవును! అందాలు చిందుతూ ఎంతో ముచ్చటగా ఉన్నవి!

చేటి: రాకుమారీ! ఇంకా కోసుకుని వస్తాను.

ప: వద్దు! వద్దు! ఇక పూలు కోయవద్దు.

వా: అమ్మా! ఎందుకని వద్దంటున్నారు?

ప: ఆర్యపుత్రులు ఇక్కడికి వచ్చేసి, ఈ పుష్ప సౌందర్యం సందర్శించి నన్ను అభినందించవలెనమ్మా!

వా: ఏమమ్మా! మహారాజు నీమీద వారా అనురాగంగా ఉంటారా?

ప: అదేమో నాకు తెలియదు. ఒక్కక్షణం ఆర్యపుత్రులు కంటికి కనుపించకపోతే మనసుకు దిగులు దిగులుగా ఉంటుంది.

వా: (స్వగతము) నేనెంత కఠోరముగా ప్రవర్తిస్తున్నాను. క్రొత్తగా వచ్చిన ఈమె సైతము ఈ విధంగా ఉంటున్నది!

చేటి: "నా భర్తకు నా మీద ఎంతో అనురాగము" అనే విషయాన్ని రాకుమారి చెప్పనట్లే ఎంతో గొప్పగా చెప్పింది.

ప : నా మనస్సులో ఒక్క సందేహం బాధిస్తున్నది.

వా : ఏమిటేమిటి ?

ప : "ఆర్యపుత్రులను నేను ప్రేమించినంతగా వాసవదత్త ప్రేమించి ఉంటుందా" అని.

వా : ఇంతకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా ఆమె ప్రేమించింది.

ప : ఆ సంగతి మీ కెట్లా తెలుసునండీ ?

వా : (స్వగతము) అయ్యో ! ఆర్యపుత్రుల మీది అపరాభిమానాల వల్ల పొరపాటున నోరుజారాను. ఇప్పు డీవిధంగా సరిపుచ్చుతాను. (ప్రకాశము) వాసవదత్తకు అంత ప్రేమ లేకపోతే తనవారి నందరినీ వదలిపెట్టి ఆర్యపుత్రుల వెంట వస్తుందా !

ప : వాస్తవమే కావచ్చు !

చేటి : రాకుమారీ ! నేను కూడ వీణ నేర్చుకుంటానని మీ భర్తగారిని అడగవమ్మా !

ప : ఆ మాట ఎప్పుడో అడిగాను.

వా : అందుకు వారేమన్నారు ?

ప : ఏమీ మాటాడకుండా ఒక్క దీర్ఘ నిశ్వాసం విడిచి మౌనం వహించారు.

వా : ఆ మౌనానికి మీరేమని అర్థం చెప్పుకున్నారు?

వ : పూజ్యురాలైన వాసవదత్త సుగుణములు స్మరించుకుని దాక్షిణ్యం వల్ల నా సముక్షంలో దుఃఖం ఆపుకున్నారని అనుకున్నాను.

వా : (స్వగతము) ఇదే యథార్థమైతే నేనెంతో ధన్యురాలను.

[ఉదయన మహారాజు, వసంతకునితో ప్రవేశించును]

వ : ఆహాహా!! అచ్చటచ్చట రాలిన మంకెన పూలతో ఈ ప్రమదావనం ఎంత ముచ్చటగా ఉన్నది! ఇటు! ఇటు! ఇటు దయచేయండి దేవరవారు!

ఉ : వయస్యా! వసంతకా! ఇదిగో వచ్చుచున్నాను.

*లోచనయుగ్మ ముజ్జయినిలోః మును వాసవదత్త రూపముఙ్ జూచిననాఁడె గ్రుచ్చెను మనోజుఁడు నా హృదయాన నైదు నారాచము; లావ్యథల్ మఱపురానివి; నేఁడు మఱొండు బాణముఙ్ వైచెను, పంచబాణుఁడుఁ టు వాఁ! డివు శారవ బాణ మేడదో?*

వ : ఆ పద్మావతీదేవిగారు ఎక్కడికి పోయినారో! ఈ లతామండపము లోనికి పోయి ఉండవచ్చు! లేదా, శార్దూలచర్మము కప్పినట్లు రంగు రంగుల పుష్పములతో నిండిఉన్న "పర్వతతిలక" మనే శిలాఫలకము మీద కూర్చుండి ఉండవచ్చు! కాదా, సుగంధబంధురమైన ఏడాకుల అరటితోటలో ప్రవేశించి విహరిస్తూ ఉండ

వచ్చు, లేదా, మృగ పక్షి చిత్రి విచిత్రితమైన 'దారుపత్రితము' నకు వెళ్ళి ఉండవచ్చు! (పైకిచూచి) ఓహో! శరత్కాలవినిర్మల విశాలాకాశంలో ప్రసారితమైన బలిచక్ర దామము వలె దాటుచు పోవుచున్న ఈ సారస పంక్తిని సందర్శించండి!

ఉ : వసంతకా! చూచుచున్నాను—

*జట్టుగ ద్రెండవకేణ ...ముక సోగుచు, పల్లకి వంప్ర సాంద్ర నా*
*కట్టుచు, మించు తోరణము కట్టిన సారస పంక్తి సాయగ*
*మ్ముట్టిపడుంగదా! కుసుమ మాల్కిన పన్నగరాజు నన్నునా*
*పొట్టవలెన్ వెలుంగు నభమున్ విహరించెడు వెండితీగలై!!*

చేటి : రాకుమారీ! అదుగో! అదుగో! అటు చూడండి! తోరణం గట్టిన తెల్లకలువల దండ వలె పాండుర వర్ణంతో నిండిన ఆ బెగ్గురు పక్షులు ఆకాశంలో ఎంత చక్కగా ఎగిరి పోతున్నవో! (ముందుకు చూచి) అమ్మయ్యో! మహారాజుగారు!

వ : ఆర్యపుత్రులా! (వాసవదత్తతో) అమ్మా! మీరు ఉన్నారు కనుక ఇప్పుడు మహారాజుగారి దర్శనం సముచితం కాదు. అందువల్ల ఈ మాధవీలతా మండపంలో ప్రవేశింపవాము.

వా : మీ యిష్టానుసారమే!

[లతా మండపము లోనికి పోవుదురు.]

వ : పద్మావతీదేవిగారు ఇప్పుడిచి వచ్చి వెళ్ళినట్లున్నారు!

ఉ : అది నీవెట్లు చెప్ప గలవు !

వ · ఇవిగో ! అచ్చటచ్చట కోసిన ఈ శేఫాలికా పుష్పాలు చూడండి· దేవరవారికే తెలుస్తుంది.

ఉ : ఆహా ! వసంతకా ! ఈ ప్రసూనసౌందర్యము నా హృదయ మును ఉద్ఘాతలూపు చున్నది.

వా : (స్వగతము) ఆర్యపుత్రుల నోటివెంట "వసంతక" శబ్దం విన్నందువల్ల మళ్ళీ ఉజ్జయినిలో ఉన్నట్లుగా ఉంది నాకు.

ఉ : వసంతకా ! ఈ శిలాఫలకము మీదనే ఆసీనులమై రాకుమారి రాకను నిరీక్షింతము.

వ : సరేనయ్యా ! సరే ! (కొంచెము కూర్చుండి. చివాలున లేచి) అబ్బబ్బా ! శరత్కాల తీక్ష్ణమైన ఈ యెండ దుస్సహంగా ఉంది. ఈ మాధవీలతా మండపము లోనికి పోదామా !

ఉ : చాల బాగున్నది. అట్లే పోదము ! నీవు ముందు నడు !

వ : సరే లేవండి !

[ఇరువురు ముందునకు పరిక్రమింతురు]

ప : ఈ వసంతకుడు గందరగోళం చేస్తున్నాడు. ఇప్పుడేం చేయాలో తోచకుండా ఉంది.

చే : అమ్మగారూ! గండు తుమ్మెదలు మూగిఉన్న ఈ పూల తీగెను కదలించి మహారాజు రాకుండా నివారిస్తాను.

ప : సరే అల్లే కానీ!

[చేటి పూలకొమ్మను కదిల్చును. తుమ్మెదలు లేచును.]

వ : బాబోయ్! బాబోయ్! ఆగండి! ఆగండి! అక్కడే ఆగండి మహారాజుగారు!

ఉ : ఏమిటీ గంతులు? ఎందుకంత భయపడుచున్నావు?

వ : ఈ దిక్కుమాలిన పాడు తుమ్మెదలు నా మీదికి వస్తున్నవి. ఉండు ఉండు! వీని పని పట్టిస్తాను.

ఉ : వలదు వలదు! వసంతకా! భ్రమరకులమును భయపెట్టవలదు!

*గంతులు వేయబోకుము సఖా! నులివెచ్చని తీయదేనియల్*
*గొంతుల కంట గ్రోలి, అనుగుం జవరాండ్ర కవుంగిలింతలన్*
*చింతలు దక్కి. సొక్కి శయనించిన ఏ మధు పావళుల్, భయ*
*భ్రాంతములై ప్రియా విరహ బాధకు బాల్పడునేమొ నావలెన్!!*

కావున నిచ్చటనే కూర్చుందము.

వ : మీ ఇష్టానుసారమే!

[ఇరువురు కూర్చుందురు]

ఉ : (అవలోకించి) వయస్యా! చూడు—

పాదములు తాక చెదరె పుష్పమ్ము లకట!
బండ యిది వెచ్చవెచ్చగా నుండె నిపుడు!
కోమలి యెవర్తయో యిటఁ గూరుచుండి,
యిప్పుడె నను జూచి లేచి పర్వెత్తిపోయె!!

చే : రాకుమారీ! రాకుమారీ! మనము పంజరములోని చిలుకల మైనాము!

ప : అదృష్టవశముచే ఆర్యపుత్రులు అచ్చటనే ఉపవిష్టులైనారు.

వా : (స్వగతము) భగవంతుని అనుగ్రహము వల్ల ఆర్యపుత్రులు యథాప్రకారము ఆరోగ్యవంతులై ఉన్నారు. (కన్నీరు నించును)

చే : (పద్మావతితో) భర్తృదారికా! ఈ అమ్మగారు ఎందుకో కన్నీరు పెట్టుకుంటున్నారమ్మా!

వా : ఏమీ లేదమ్మా! ఈ అల్లరి తుమ్మెదలు చెలరేగడం వల్ల తెల్ల పూల రేణువులు రేగి నా కళ్లలో పడ్డవి. అందువల్ల నాకు కన్నీరు వచ్చింది.

ప : అంతే కావచ్చునమ్మా! .

ప : (అటునిటు చూచి) ఈ ఉద్యానవనములో ఇతరులు ఎవరూ లేరు. మిమ్ము ఒకమాట అడుగవలెనని ఉన్నది. ఇప్పుడే అడుగమంటారా!

ఉ : స్వేచ్ఛగా అడుగవచ్చును.

వ : ఆనాటి వాసవదత్తా, ఈనాటి పద్మావతీ, ఏ రిదుపురిలో మీకు ఎవరిమీద ఎక్కువ ప్రేమ ?

ఉ : ప్రణయ రహస్యములు ప్రశ్నించి నన్ను చాల చిక్కులో పెట్టితివి ?

ప : ఈ ప్రశ్న వల్ల ఆర్యపుత్రులకు ఏమి చిక్కు వచ్చినదో !

వా : (స్వగతము) నేనెంత దురదృష్టవంతురాలను !

వ : ఎందుకూ ఏలినవారి కీ సందేహము ? స్వేచ్ఛగా చెప్పండి. ఏమీ భయము లేదు. ఒకామె చనిపోయింది; ఒకామె సమీపములో లేదు.

ఉ : చెప్పను ! చెప్పను ! నీ నోరు మంచిది కాదు.

ప : చెప్ప వలసినదేమో చెప్పనే చెప్పినారు ! ఇంకనూ ఆర్య పుత్రులు ఏమి చెప్పుతారు ?

వ : ఇదుగో ! వినండి ! ఒట్టు పెట్టుకుంటున్నాను. దేవునితోడు ! ఎవ్వరికీ చెప్పను. నా నోటికి తాళము వేస్తున్నాను.

ఉ : చెప్పుట కుత్సాహముగ లేదోయి !

ప : ఏమిటీ వసంతకుని మొండితనము ! ఈ మాత్రము మంచీ చెడ్డా తెలుసుకోకుండా—

వ : చెప్పరూ ! ఇప్పుడు గనుక చెప్పకపోతే ఈ శిలాఫలకము మీద నుంచి ఒక్క అడుగు కూడా కదలడానికి వీలులేదు. మీ రిక్కడ కట్టి వేయబడినట్లే !

ఉ : అంత బలాత్కారమా !

వ : అవును ! బలాత్కారమే.

ఉ : అయినచో అదేమో చూడవలసినదే !

వ : దేవరవారు అనుగ్రహించాలె ! ఇప్పుడు సత్య ప్రమాణంగా నిజం చెప్పకపోతే మన స్నేహము ఈ రోజుతో సరి !

ఉ : ఇక గత్యంతర మేమున్నది. వసంతకా ! చెప్పుచున్నాను విను-

శీల సౌందర్య మాధురీ శ్రీ లలామ
రమణి పద్మావతియె ప్రియురాలు మాకు;
కాని, వాసవదత్తానుగత మదీయ
చిత్తము హరించుటకు నీమె చేత కాదు.

వా : (స్వగతము) నా ప్రయాసకు తగిన ప్రతి ఫలము ముట్టినది. అజ్ఞాతవాసము సైతము ఆనంద ప్రదముగా అవతరించినది.

చేటి : (పద్మావతితో) రాకుమారీ ! నీ భర్తగారు ఎంత దాక్షిణ్యము లేనివారమ్మా !

ప : కాదు ! కాదే ! ఈ నాటికి కూడా పూజ్యురాలైన వాసవదత్త సద్గుణములు స్మరించడం చూస్తే, వారి దాక్షిణ్య భావం ప్రకటిత మవుతూనే ఉంది.

వా : అమ్మా ! ఆభిజాత్యమునకు అనురూపముగా అన్నారు.

ఉ : నేను చెప్పితిని. ఇప్పుడిక నీవు చెప్పవలయును. నీ కెవరసిన ఇష్టము ? అప్పటి వాసవదత్తయా ? ఇప్పటి పద్మావతియా ?

ప : ఆర్యపుత్రులు కూడా విదూషకు లైనారు.

వ : ఇందులో నేను ప్రత్యేకించి చెప్పే దేమున్నది ? ఇరువురూ ఇష్టమైనవారే !

ఉ : ఎంత బుద్ధిమంతుడవు ! నా చేత బలాత్కారముగా చెప్పించి, నీవు చెప్పవలసి వచ్చినపుడు నీళ్ళు నములుచున్నావా !

వ : అయితే నన్ను కూడా బలాత్కారము చేస్తారా !

ఉ : 'నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష'

వ : అయితే నా నోటి వెంట ఒక్క అక్షరం కూడా రాదు.

ఉ : అనుగ్రహించండి విదూషకులవారు ! స్వేచ్ఛగా సెలవీయండి !

వ : అయితే ఆలకించండి మహారాజుగారు. పూజ్యురాలైన వాసవ

దత్తంటే నాకు చాలా ఇష్టము. పద్మావతీదేవిగారు మాత్రము సామాన్యురాలా ! ఆ కారుణ్యమూ, ఆ లావణ్యమూ, ఆ వినయ విధేయతలూ, ఆ తీయని మాటలూ, ఆ సుతిమెత్తని హృదయమూ, ఆహా ! ఆహా ! చాలా మంచివారు ! అయితే వాసవదత్తలో మరొక గొప్ప విశేష మున్నది. "వసంతకులవారు ఎక్కడున్నారు ? ఎక్కడున్నారు ?" అని వెదకు కొంటూ వచ్చి కడుపు నిండా కమ్మని భోజనము పెట్టేది !

వా : (స్వగతము) మేలు ! మేలు ! వసంతకా ! ఇప్పుడు వాసవదత్తను చక్కగా స్మరింపుము !

ఉ : బాగు బాగు ! వసంతకా ! ఈ సంగతి వాసవదత్తతో వచింతెదను.

వ : అయ్యయ్యో ! వాసవదత్తతోనా ! వాసవదత్త ఎక్కడున్నది ? ఆమె చనిపోయి చాలా కాలమయినది గదా !

ఉ : (దుఃఖముతో) వాస్తవమే ! వాసవదత్త మరణించినది—

*నర్మ సంభాషణములతో నా మనస్సు*
*నెచ్చు కెచటికొ పరువు లెత్తించినావు !*
*నాటి యలవాటువే పొరపాటు వలన*
*వెనుకటి విధాన నా నోట వెడలె మాట !!*

వ : కథ చాలా రమణీయముగా నడచింది. కాని రక్తికట్టు సమయానికి రస భంగము చేసినాడీ వసంతకుడు.

వా : (స్వగతము) ఇప్పటికి నా హృదయానికి కొంచెము సంతృప్తి సమకూరినది. అప్రత్యక్షముగా ఉండి, ఈ విధమైన మధుర వాక్కులు వీనుల విందుగా వింటున్నందుకు ఎంతో సంతోషముగా ఉన్నది.

వ : ఊరడిల్లండి ఊరడిల్లండి మహారాజగారు! ఈశ్వరేచ్ఛ ఏ విధంగా ఉన్నదో ఆ విధంగా జరిగిపోయినది. విధి విధానం అతిక్రమించటానికి ఎవరు సమర్థులు!

ఉ : వసంతకా! నా హృదయావేదన నీ కెట్లర్థ మగును? ఏమందువా—

*వంతలు విచ్చి తెఱచితి వలపుతలుపు*
*చింతలు చిగిర్చె మది తలంచిన కొలంది;*
*బాష్పములు గార్చె, గుండెల బరువుప్రదేర్చి,*
*వెచ్చనూర్పులె సుమ్ము! జీవితవిధమ్ము!*

వ : దేవరవారి ముఖమండలము కన్నీళ్ళతో నిండిపోయినది. కడుగుకొనుటకు నీళ్ళు తెస్తాను.

[నిష్క్రమించుచున్నాడు]

ప : (వాసవదత్తతో) అమ్మా! ఆర్యపుత్రులు ఉత్తరీయముతో కన్నీరు ఒత్తుకొనుచున్నారు. మనము తప్పించుకొని వెళ్ళిపోవటానికి ఇదే మంచిసమయం!

వా : అలాగే ! అయినా చూడండి ! మీరుంటేనే బాగుంటుందేమో ! ఏమంటారా, ప్రణయోత్కంఠితలైన ప్రాణపతిని ఒంటరిగా వదలిపెట్టి వెళ్ళిపోవటము మంచిదికాదు. మీరు ఇక్కడే ఉండండి ! నేను వెళ్ళిపోతాను.

చే : ఈ అమ్మగారు అన్నమాట అన్నివిధాలా బాగున్నది. రాకుమారీ ! మీరు రాజుగారివద్దకు వెళ్ళండి !

ప : (వాసవద_త్తతో) ఆర్యపుత్రులను సమీపించమంటారా ?

వా : అవశ్యము !

[వాసవద_త్త నిష్క్రమించుచున్నది]

[పద్మావతి రాజును సమీపించుచుండగా వసంతకుడు నళినీపత్రమునిండ నీరునింపుకొని ప్రవేశించుచున్నాడు]

వ : ఎవరు ! పద్మావతీదేవిగారా !

ప : ఏమి ! ఆర్యవసంతకులా ! ఇదేమిటి ?

వ : ఇదే అది ! అదే ఇది !

ప : అయ్యో ! అదేమిటో స్పష్టముగా చెప్పండి !

వ : అయితే వినండి ! గాలికి రేగివచ్చిన కాశకుసుమపరాగము కండ్లలో పడుటచేత నీ భర్తగారికన్నులు బాష్పములతో నిండినవి. ఇవిగో ! ఈనీళ్ళు తీసుకువెళ్ళండి ! త్వరగా !

వ : (స్వగతము) ఓహో : దాక్షిణ్యవంతులగువారి పరిజనముకూడ దాక్షిణ్యము కలదే! (నీరు తీసికొని రాజును సమీపించి) ఆర్య పుత్రులకు జయము జయము! ఇదిగో! ముఖోదకము!

ఉ : ఎవరు ? పద్మావతియా ? (రహస్యముగా) వసంతకా ! ఏమిటిది ?

వ : (చెవిలో) ఈవిధముగా జరిగింది.

ఉ : చాల బాగున్నది. (జలము గ్రహించి) పద్మావతీ! నెమ్మి కూర్చుండుము!

వ : చిత్తము (కూర్చుండును)

ఉ : పద్మావతీ ! చూడు—

చూడు శారదచంద్రికా గౌరమైన
రెల్లు పూవమ్ము గాలికి రేగెనేమొ!
కంటిలో వచ్చిపడె వాలుగంటి! నాకు,
దాన బాష్పాకుల మ్మయ్యెనాననమ్ము.

(స్వగతము) ఈమె కిట్లు చెప్పుటయే యుక్తము. ఏలనన—

క్రొత్త పెండ్లికూతురీ కోమలాంగి
సత్యమౌ నా యథార్థమ్ము విన్నదేని;
నొందుకుండదె యీమె సందియములేదు,
కాని - కాంతాస్వభావమ్ము కాతరమ్ము.

ప : వయస్యా ! అపరాహ్ణసమయ మైనది. పూజ్యులైన మగధమహా రాజుగారు మిమ్ములను ముందుంచుకొని బంధుమిత్రులకు సందర్శన మిచ్చే సమయం సమీపిస్తున్నది. సహృదయత్వము సహృదయత్వముతో సమన్వయించినప్పుడేగదా అన్యోన్యానురాగము ఆవిర్భవించేది. కావున తొందరగా పోదాము లేవండి !

ఉ : బాగుబాగు ! చక్కగా చెప్పితివి !

మంచిగుణములతో ప్రకాశించువాడు
మంచిమంచి సత్కృతులు గావించువాడు
కానవత్తురు కాని లోకమ్మునందు
వాని లోతు తెలియంగెడు వారె లేరు.

[అందఱు నిష్క్రమించుచున్నారు]

# స్వప్నవాసవదత్తము

## పంచమాంకము

[అంత పద్మనిక ప్రవేశించుచున్నది]

ప : మధురికా ! మధురికా ! శీఘ్రంగా రావే !

[మధురిక ప్రవేశించుచున్నది]

మ : ఇదిగో వస్తున్నాను. ఎందుకు అంతతొందరపడుతూ పిలిచావు?

ప : నీ కింకా తెలియదు మనే మన భర్తృదారిక పద్మావతి తలనొప్పితో బాధపడుతున్నది.

మ : అయ్యో ! పాపం ! ఇప్పుడేమి చేద్దాము ?

ప : నీవు ఇక్కడున్నట్లుగా పోయి పూజ్యురాలైన అవంతికమ్మను పిలుచుకొనిరా ! రాకుమారి శిరోవేదనతో బాధపడుతున్నదని మాత్రం ఆమెతో చెప్పు. ఆమాట చెవినిపడ్డ తక్షణం ఆమె తెక్కలు కట్టుకొని వచ్చి వాలుతుంది.

మ : ఆమెమాత్రం వచ్చి ఏమిచేస్తుంది ?

ప : ఏమిచేస్తుందేమిటి ? కమ్మకమ్మని కథలుచెప్పి మన రాకుమారి తలనొప్పి తగ్గించే చాతుర్యం ఆమెలో ఉన్నది.

మ : సరే బాగున్నది, కాని మన భర్తృదారికకు పక్క ఎక్కడ ఏర్పాటుచేశారే ?

ప : సముద్రగృహకంలో. నీవు తొందరగాపద ! నేను మహారాజు గారి కీ వార్త తెలియజేయటానికి వసంతకయ్యను వెదకుతాను.

మ : సరే తొందరగా కానీ !

[నిష్క్రమించుచున్నారు]

ప : వసంతకయ్య ఏమైపోయినాడో !

[వసంతకుడు ప్రవేశించుచున్నాడు.]

వ : (స్వగతము) వాసవదత్తా వియోగంవల్ల వైక్లబ్యం వహించిన మా ఉదయన మహారాజుగారి హృదయం పద్మావతీ పాణి గ్రహణ మహోత్సవంతో మఱింత విరహసంతప్తమైపోయింది. సంతోషప్రదమైన ఈ సమయంలోకూడా, వారు వాసవదత్తను తలంచుకొని చాలా బాధపడుతున్నారు. (పద్మినికనుచూచి) ఎవరు ! పద్మినికా ! ఇదేమిటి ఇక్కడున్నావు ?

ప : వసంతకయ్యగారూ ! నీకోసమే వెదకుతున్నాను. రాకుమారి పద్మావతీదేవి శిరోవేదనతో చాలా బాధపడుతున్నారు.

వ : అయ్యో ! పాపము ! నాకు తెలియనే తెలియదు !

వ : తక్షణంపోయి ఈ సంగతి నీవు మహారాజుగారికి మనవిచెయ్యి. ఇంతలో నేను బాధోపశమనానికి ఏదైనా ఔషధం తెస్తాను.

వ : మీ రాజపుత్రికి శయ్య ఎక్కడ ఏర్పాటుచేసినారు ?

వ : సముద్రగృహకంలో

వ : సరే నీవుపద ! నేను మహారాజుగారికి ఈసమాచారం నివేదించి వారిని సముద్రగృహకానికి తీసుకొని వస్తాను.

[ఇరువురు నిష్క్రమించుచున్నారు. ఇది ప్రవేశకము]

[అంత ఉదయనుడు ప్రవేశించుచున్నాడు.]

ఉ : ఆహా !

*మాని మనోవ్యథల్ మఱొక మానిని పాణి పరిగ్రహించి, కా*
*లానుగతిన్ చరింతు - నిప్పుడైనను మంత్రి కగ్గమైన లా*
*వాణక భాగ్యదేవత, అవంతినరేంద్రుని ముద్దుబిడ్డయే*
*కానబడున్ కనుంగవ కఖండిత హిమాహత పద్మినీ క్రియన్.*

వ : (ప్రవేశించి) మహారాజుగారూ ! త్వరపడండి ! త్వరపడండి !

ఉ : ఏమిటీ తొందర ?

వ : పద్మావతీదేవిగారు తలనొప్పితో విపరీతంగా బాధ పడు చున్నారట !

ఉ : ఎవరు చెప్పినారు ?

వ : దేవిగారి సఖి పద్మినిక చెప్పింది.

ఉ : అహో ఎంత కష్టము !

సుగుణవతి, పద్మనయనయని యక్క, మరల
పత్నిగ లభించె నని తృప్తిపడితికాని
ప్రాప్త మగు పూర్వదుఃఖానుభవమువలన
నప్పు జేమౌనా యంచు శంకించు మనసు.

ఇప్పుడు పద్మావతి ఎచ్చటనున్నదో నీకు తెలియునా ?

వ : ఆమెకు విశ్రాంతికోసం సముద్రగృహకంలో ప్రక్క ఏర్పాటు చేసినారట !

ఉ : సరే ! అచ్చటకే పోదము పద !

వ : చిత్తము ! దయచేయండి !

[ఇరువురును ముందునకు పరిక్రమించుచున్నారు]

వ : ఇదిగో ! ఇదియే సముద్రగృహకము. ప్రవేశించండి.

ఉ : ముందు నీవు నడువుము.

వ : చిత్రము ! (ముందుకునడచి) అమ్మయ్యో ! కొంపమునిగింది. ఆగండి ! ఆగండి !

ఉ : ఏమి మునిగింది ?

వ : అదుగో ! అదుగో ! చూడండి ! ఆ ఉపకాంతులలో నేలమీద ప్రాకుచున్న తెల్లని త్రాచుపాము ఎంత పొడుగుందో !

ఉ : (చూచి నవ్వుచు) ఎంత మందబుద్ధివి !

*పొడుగుగా వ్రేలగట్టిన పూలదండ*
*వాకిటనె క్రింద తోరణద్వారమందు;*
*గాలి కది మెల్లమెల్లగా కదలి కదలి*
*త్రాచుపాముగ నీకు ప్రత్యక్షమయ్యె.*

వ : (చూచి) మీ మాట వాస్తవమే. కాలసర్పముగాదు, పూలదండ. (లోనికి ప్రవేశించి అంతటను చూచి) పద్మావతీదేవిగారు ఎచ్చో వెళ్ళిపోయినట్లున్నారు.

ఉ : ఇంకను దేవి రాలేదని నా యభిప్రాయము.

వ : ఆసంగతి మీరెట్లు చెప్పగలరు ?

ఉ : చెప్పుట కేమున్నది. చూడు—

అణుమాత్రమును విపర్యస్తమ్ము కాలేదు—
పట్టుపానుపు తనూ స్పర్శమున!
ఇంతైన నలిగిపోనే లేదు - వలిపంపు
చలువ దుప్పటి పాదతాడనమున!
లవలేశమును పంకిలముగాదు - క్రొంగ్రొత్త
తలగడ శీర్షౌషధములవలన!
ఇంచుకంతయు సంతరించినట్లె లేదు—
కనులవింపగ నలంకార రచన!

వచ్చియుండలేదు వనజాతలోచన
వచ్చెనేని శయ్యవదలిపోదు;
వ్యాధి కలుగు జనము బాధోపశాంతికై
విశ్రమించు నెపుడు? వెడలు నెపుడు?

వ: అందువల్ల ఈ పట్టుపానుపు మీద దేవరవారు ఒక్క ముహూర్తకాలం కూర్చుండి పద్మావతీదేవిగారికోసం ప్రతీక్షిస్తే బాగుంటుంది.

ఉ: మంచిది (కూర్చుండి) వసంతకా! నాకు నిద్రవచ్చుచున్నది. తెప్పలు లాగుచున్నవి. కాలక్షేపముకొఱకు కమ్మని కథ నేదైనా చెప్పుము.

వ: నేను కథచెప్పుతూ ఉంటాను. మీరు 'ఊఁ' కొట్టుతూ వినండి.

ఉ: సరే, ప్రారంభించుము!

వ : అనగా అనగా ఉజ్జయిని అనే పట్టణం ఉన్నది. ఆ పట్టణంలో స్నానంచేయటానికి చక్కటి చెరువులు చాలా ఉన్నవి.

ఉ : ఏమి! ఉజ్జయినీ పట్టణమా?

వ : ఈకథ మీకు బాగా ఉండకపోతే ఇంకో కథ ప్రారంభిస్తాను.

ఉ : వయస్యా! కథ బాగుండకపోలేదు. కాని ఉజ్జయినీ సంస్మరణముచే ఆనాటి వాసవదత్త స్మరణమునకు వచ్చినది—

*వెలవెలనై ప్రయాణమగు వేళను, వెచ్చని బాష్పబిందువుల్*
*జలజల జాలువారగ విశాల వినీల విలోచనంబులన్,*
*వెలయు యవంతిరాజసుత స్నేహభరమ్మున నాయురమ్మునన్*
*దలసిడె, కన్నవారి విడనాడుట కన్నెలకెంత కష్టమా!*

ఇంతేకాదు. ఒకనాడు—

*నెలత సంగీతపాఠమ్ము నేర్చుకొనుచు*
*మనసు నాపై లగించి మైమఱచిపోయె;*
*వెలది కెంగేలు వీణ తీవియలు విడిచి*
*గాలిలో పైకి క్రిందికి తేలియాడె.*

వ : సరేలెండి. ఆకథ వదలివేస్తాను. అనగా అనగా పూర్వం బ్రహ్మదత్తమనే పేరుగల పట్టణం ఉండేది. ఆ పట్టణంలో కాంపిల్యు డనే రాజుండేవాడు.

ఉ : ఏమి ఏమిటి? మరల చెప్పుము?

వ : బ్రహ్మదత్తమనే పట్టణంలో కాంపిల్యుడనే రాజుండేవాడు.

వి : మూర్ఖుడా ! 'కాంపిల్య మనే పట్టణములో బ్రహ్మదత్తు డనే రాజు' అని చెప్పవలెను.

వ : ఏమేమి ! రాజు పేరు బ్రహ్మదత్తుడా ! పట్టణం పేరు కాంపిల్యమా !

వి : అవును. అంతే.

వ : అట్లయితే దేవరవారు ముహూర్తకాలం ఓపికపట్టండి. ఇంతలో నేనీ మాటను గట్టిగా వల్లెవేసి కంఠస్థం చేస్తాను. బ్రహ్మదత్త డనే రాజూ కాంపిల్య మనే పట్టణం. కాంపిల్య మనే పట్టణం బ్రహ్మదత్తుడనే రాజు. (అని చాలమారులు వల్లించి) ఇప్పుడు వినండి. మహారాజుగారూ ! పలకరేం (చూచి) రాజుగారికి నిద్రపట్టింది. అమ్మా ! చాలా చలిగా ఉన్నది. పోయి నాదుప్పటి తెచ్చుకొంటాను.

[వసంతకుడు నిష్క్రమించుచున్నాడు.]

[అంత అవంతికా వేషధారిణియగు వాసవదత్తయు చేటియు ప్రవేశించుచున్నారు]

చే : రండి రండి అమ్మగారూ ! రాకుమారిగారు తలనొప్పితో విశేషంగా బాధపడుతున్నారు.

నా : అయ్యో పాపం ! ఆమె ఎక్కడ పరుండి ఉన్నారే !

చే : సముద్రగృహకంలో వారికి సెజ్జ అమర్చినారమ్మా.

నా : అయితే తొందరగా నడవవే !

[ఇరువురును పరిక్రమించుచున్నారు]

చే : ఇదేనమ్మా ! సముద్రగృహకం. తమరు లోపలికి వెళ్ళండి. నేనుపోయి శీర్షానులేపనం తెస్తాను.

[చేటి నిష్క్రమించుచున్నది.]

నా : అయ్యో ! దైవానికి కూడ నామీద దయలేదుకదా ! విరహోత్కంఠితులైన ఆర్యపుత్రులకు విశ్రాంతిస్థానముగా పద్మావతి ప్రాప్తించింది కదా అని భావిస్తూఉంటే ఈమెకీ అస్వస్థత ఏమి ! లోపలికి వెళ్ళతాను. (ముందుకు పరిక్రమించి) ఆహా ! ఏమీ పరిచారికల ప్రమత్తత ! అస్వస్థురాలైన పద్మావతిని ఇక్కడ ఒంటరిగా వదలివేసి వెళ్ళినారు. దీపం మాత్రం వెలుగుతూ ఉంది. తలనొప్పి కొంచెం తగ్గింది కాబోలు. ఈమె నిద్రపోతూ ఉన్నది. ఇక్కడ కూర్చుంటాను. అయినా నాకూ పద్మావతికీ ఉన్న స్నేహానికి వేరొకచోట కూర్చుండటం ఏమంత బాగుండదు. ఈమె ప్రక్కలోనే కూర్చుంటాను. (ఉదయనుని సమీపమున కూర్చుండి) ఇదేమి ! పద్మావతిదగ్గర కూర్చుంటే ఈ రోజు నా హృదయం ఎందుకో పొంగిపోతూ ఉన్నది.

ఈమె హాయిగా నిద్రిస్తూ ఉన్నది. శిరోవేదన కొంచెం ఉపశ మించి ఉండవచ్చు. పద్మావతి పర్యంకముపై నొక ప్రక్కకు ఒత్తిగిలి పడుకున్నది. నన్ను కూడ తనప్రక్కన పడుకోమని ఈమె ఉద్దేశం కావచ్చు.

[వాసవదత్త శయనించబోవును. ఉదయనుడు కలవరించును.]

ఉ : వాసవదత్తా ! వాసవదత్తా !

వా : (చివాలున లేచి) అమ్మయ్యో ! ఆర్యపుత్రులు ! పద్మావతి కాదు ! నన్ను చూచినారేమో ! మహామంత్రి యౌగంధరాయణులవారి ప్రతిజ్ఞాభారమంతా నేను బయట పడడం వల్ల నిష్ప్రయోజనం అయిపోయింది.

ఉ : అయ్యో ! అవంతి రాజకుమారి !

వా : అదృష్టవంతురాలను. ఆర్యపుత్రులు కలవరించు తున్నారు. ఇచ్చట మరెవ్వరు లేరు. ఒక్కక్షణం సేపు నిలబడి కన్నుల విందుగా చూచుకుని హృదయశాంతి చేకూర్చుకుంటాను.

ఉ : ప్రేయసీ ! ప్రియశిష్యురాలా ! అయ్యో ! మాటలాడవేమి ?

వా : మాటాడుతూనే ఉన్నాను.

ఉ : కోపమువచ్చినదా ?

వా : లేదు నాథా! లేదు. సంతాపముతో క్రుంగిపోతున్నాను.

ఉ : ఆగ్రహము రాని పక్షమున అలంకరించుకొనలేదేమి?

వా : ఇప్పు డింతకంటె ఇంకా ఏమి అలంకరించుకోవాలి?

ఉ : 'విరచిక' జ్ఞాపకమున్నదా?

వా : (కొంచెము కోపముతో) చాలులెండి! ఇప్పటికూడ విరచిక యేనా!

ఉ : అదే కారణమైనచో విరచిక విషయములో నిన్ను ప్రతిమాలు కొందును.

[అని చేతులు చాచుచున్నాడు.]

వా : చాలసేపయింది. ఎవరికి కన్పించకుండా ఇక్కడనుంచి మెల్లిగా వెళ్ళిపోవాలి. ఆర్యపుత్రుల దక్షిణ హస్తము క్రిందికి వ్రేలాడుతున్నది. మళ్ళీ ప్రక్కమీద ఉంచి వెళ్ళుతాను.

[అట్లు చేసి నిష్క్రమించుచున్నది.]

ఉ : (చివాలునలేచి) వాసవదత్తా! పోకు పోకు! అబ్బా!

*సంభ్రమంబున వెలివెంటఁ జనెడు నాకు*
*ద్వారబంధమ్ము 'లంగున' తలకుఁ దగిలె*
*సంశయింపగలేకుంటి 'స్వప్న' మంచు*
*నిశ్చయింపంగలేకుంటి 'నిజ' మటంచు.*

వ : (ప్రవేశించి) ఓహో ! మహారాజుగారికి మెలకువ వచ్చిందా ?

ఉ : మిత్రమా ! నీ కొక ప్రియమైన వార్త చెప్పెదను. వాసవదత్త బ్రతికియున్నది.

వ : వాసవదత్తా ! జీవించియున్నదా ? ఎంతపిచ్చివారు ! ఆమె చాల కాలము క్రిందటనే చనిపోయింది మహారాజా !

ఉ : వసంతకా ! అట్లుకాదు. నామాట నమ్ము !

నిజము నిజమోయి ! శయ్యపై నిదుర పోవ
నన్ను మేల్కొల్పినామె తన్వంగి యిప్పుడు !
బూటకమ్మోయి ! దగ్ధమైపోయె నంచు
నన్ను నమ్మించె మన రుమణ్వంతుఁ డప్పుడు !

వ : అసంభవము ! అసంభవము ! ఇంకాక ఉజ్జయినీ సంస్మరణం వల్ల పూజ్యురాలయిన వాసవదత్త మీకు జ్ఞాపకం వచ్చి ఉంటుంది, అదే ఆలాపనగా నిద్రించటం వల్ల స్వప్నంలో ఆమె కన్పించిఉంటుంది.

ఉ : ఏమీ ! నేను చూచినది స్వప్నమా !

సకియ చనుదెంచు టిది యొక స్వప్న మేని
మేలుకొనకుండుటే చాల మేలు నాకు;
కాంత కనుపించు టిది యొక భ్రాంతియేని
ఆ మనోభ్రాంతియే చిర మభిలషింతు.

వ: మహారాజా! ఈపట్టణంలో అవంతిసుందరి అనే యక్షిణి ఉన్నదట! బహుశా ఆమె మీకు కలలో కన్పించిందని తలుస్తాను.

ఉ: కాదు! కాదు!

కన్నుగవ విప్పినంత సాక్షాత్కరించె
నతుల సౌందర్యవతి ప్రాణసతి యుక్తయు
నుదుట వ్రేలాడు నిడుద ముంగురులతోడ
కజ్జలస్పర్శ మెఱుఁగని కనులతోడ.

ఇంతేకాదు వసంతకా చూడు—

సంభ్రమాశ్చర్య విహ్వలస్వాంత కాంత
గట్టిగా నాడు ముందేయి పట్టుకొనియె;
స్వప్నసుందరి మధుర సంస్పర్శనమున
పులకితము మత్కరాబ్జ మిప్పుడును గూడ.

వ: మహారాజా! ఇకచాలు కాని అంతఃపురానికి పోదాం పదండి.

[కంచుకి ప్రవేశించుచున్నాడు.]

కం: జయము జయము! ఉదయన మహారాజు వారికి. మాదర్శక మహారాజుగారు తమతో ఈ విధముగా చెప్పమన్నారు- మీ అమాత్యుఁడు ఋమణ్వంతుఁడు అఖండ సేనా సమేతుడై మీ శత్రువైన 'ఆరుణి'ని జయించుటకు వచ్చియున్నాఁడు. నేను

కూడ చతురంగబలములతో సమర సన్నద్ధుఁడనై యున్నాను. ఇంతేకాక—

శత్రులు చీలిపోయిరి, ప్రజల్ ముదమంది భవద్గుణమ్ములన్ స్తోత్ర మొనర్చినారు, భయ శూన్యము పార్ష్ణితల మ్మదెల్ల, స ర్వత్ర జయోజ్జ్వలమ్ము రణరంగము, సేనలు గంగదాటె, నీ యాత్ర నిరంకుశంబు, వశమైనవి నీ కివె వత్సదేశముల్.

ఉ : (లేచి) మంచిది. ఇదిగో వచ్చుచున్నాను—

వారణ తురంగ పూర్ణము
దారుణ మార్గణ తరంగ తతి సంకీర్ణ
మ్మౌ రణ మహార్ణవమ్మున
'నారుణి' మారణ మొనర్తు నతి శీఘ్రగతిన్.

[అందరు నిష్క్రమింతురు.]

# స్వప్నవాసవదత్తము

## షష్ఠాంకము

[కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాడు.]

కాం : ఎవరక్కడ ? కాంచన తోరణద్వారమునందు నిలువబడి యున్నారు ?

[ప్రతీహారి ప్రవేశించుచున్నది.]

ప్ర : ఆర్యా ! నేను విజయను. తమ కేమి కావలయును ?

కాం : అమ్మా ! ఉజ్జయినినుండి మహాసేనులవారి పంపున రైభ్యస గోత్రుడైన కాంచుకీయుఁడును, మహారాణి అంగారవతి పంపున వాసవదత్త దాదియగు వసుంధరయు వచ్చి ద్వారమువద్ద వేచి యున్నారని, వత్సరాజ్యలక్ష్మి విరాజితులైన మీ ఉదయన మహారాజుగారితో మనవి చేయుము.

ప్ర : రాజసందర్శనమునకు ఇది సమయము కాదే !

కాం : ఎందువలన ?

ప్ర : మనవి చేయుచున్నాను- ఇంతకుముందుగనే మహారాజు 'సూర్యముఖ ప్రాసాదమునకు' వచ్చి ఎవ్వరో వీణ వాయించినారు. ఆ వీణాధ్వని విన్నంతనే మహారాజుగారు 'ఇది ఘోషవతి నినాద' మని పలికినారు.

కాం : తరువాత, తరువాత.

ప్ర : తరువాత మహారాజుగారు అతనివద్దకు వచ్చి 'ఈ వీణ నీ కేవిధంగా ప్రాప్తించింది ?' అని ప్రశ్నించారు. ఆ నూతన పురుషుడు 'మేము నర్మదానదీ తీరమున విహరించుచుండగా ఒక చెట్టుపొదలో ఈవీణ చిక్కుకొని యున్న దనియు ప్రభువుల వారి కిది ఆవశ్యకమైనచో తీసుకొనవచ్చు' ననియు విన్నవించుకొన్నాడు. తరువాత మహారాజుగారు ఆ పురుషుని సబహుమానంగా సాగనంపి ఆ వీణను ఒడిలో నుంచుకొని మూర్ఛాక్రాంతు లైనారు. కొంతసేపటికి ఒడలు తెలిసి కన్నులనుండి అశ్రుధారలు జలజల ప్రవహింప 'ఘోషవతీ ! నీవు కన్పించితివి. దేవిమాత్రం దర్శన మీయలేదు' అని శోకింపసాగారు. ఆర్యా ! మహారాజుగారు ఇట్టి అవస్థలో ఉన్నారు. ఈసమయంలో మీరాక ఏవిధంగా మనవి చేసేది ?

కాం : అమ్మా ! మనవి చేయక తప్పదు. మా యాగమన కారణము కూడా అందులకు సంబంధించినదే !

ప్ర : ఆర్యా ! ఇదిగో మనవి చేస్తున్నాను. అదుగో ! మహారాజు

గారు 'సూర్యా ముఖప్రాసాదం' నుంచి దిగివస్తూ
ఇక్కడే మనవి చేస్తాను.

కాం: అమ్మా! అట్లే కానిమ్ము!

[ఇరువురు నిష్క్రమింతురు.]

[ఇది మిశ్రవిష్కంభకము.]

[అంత ఉదయనుఁడును, విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

ఉ: ఘోషవతీ! ఘోషవతీ!

*కమ్మని గీతులన్ శ్రుతి సుఖమ్మొనరించుచు హర్షపారవ*
*శ్యమ్ము వహించు దేవి ప్రణయాంకములో నిదురించు నీవయో!*
*దుమ్ము దుమారమందు బడి దొర్లుచు నొంటరిగా నరణ్యవా*
*సమ్మును చేసినావు? ఖగ సంతతి తంత్రుల గూండ్లు వెట్టగన్.*

విపంచీమతల్లీ! దేవీ వియోగము నెట్లు సహించుచుంటివి. ఆ తపస్విని విడిచి ఇంతకాల మెట్లొంటరిగా నుంటివి? ఇంత కఠినహృదయము నీ కెక్కడనుండి వచ్చినది?

*స్మరియించు చుందువా! వరవర్ణినీ వామ*
*పార్శ్వ సస్నేహ సంస్పర్శనములు—*
*తలపోయుచుందువా! కలభాషిణీ రహః*
*ప్రణయమంజుల నర్మ భాషణములు—*

భావించుచుందువా ! ప్రణయినీ సంగీత
శృంగార రస సమాలింగనములు—
చింతించు చుందువా ! సీమంతినీ గూఢ
విరహ విహ్వాల ముగ్ధ వీక్షణములు—

మననము నొనరించు చుందువా ! మధుర మూర్తి
నిత్యకల్యాణ కంకణ నిక్వణములు—
నాటి మన ప్రేమబంధ మీ నాటి కిట్లు
పరిణమించి వియోగ ప్రబంధ మయ్యె !

వ : మహారాజా ! మీ రీవిధంగా వియోగదుఃఖముతో క్రుంగిపో
వటం ధర్మం కాదు.

ఉ : వసంతకా !

మున్ను నాలో ప్రసుప్తమై యున్న ప్రేమ
యిండియు ప్రబుద్ధమయ్యె నీ వీణవలన;
ఘోషవతి నెట్టులో కనుంగొంటి కాని
దీని మ్రోగించు ప్రియురాలు కానరాదు.

వయస్యా ! వసంతకా ! ఈ ఘోషవతిని మన శిల్పివద్దకు గొని
పోయి తీవలు సరిచేయించి తీసికొనిరమ్ము !

వ : ప్రభువుల ఆజ్ఞానుసారమే చేస్తాను.

[ఘోషవతిని తీసికొని నిష్క్రమించుచున్నాడు.]

ప్ర: (ప్రవేశించి) జయము జయము ప్రభువులకు! ఉజ్జయిని నుంచి

మహాసేన మహారాజుల పంపున రైభ్యసగోత్రుడైన కాంచుకీయుఁడును, మహారాణి అంగారవతి పంపున వాసవదత్త దాదియగు వసుంధరయు వచ్చి ద్వారందగ్గర వేచియున్నారు.

ఉ: జనచో ముందు పద్మావతిని బిలుచుకొనిరమ్ము !

ప్ర : చిత్తము ! (నిష్క్రమించుచున్నది)

ఉ : ఏమీ ! ఈ వృత్తాంత మింతశీఘ్రముగనే మహాసేనులవారికి తెలిసినదా !

[అంత పద్మావతియు ప్రతీహారియు ప్రవేశించుచున్నారు.]

ప్ర : రాకుమారీ ! రండి ! ఇటు దయచేయండి !

ప : జయము జయము ఆర్యపుత్రులకు ! !

ఉ : పద్మావతీ ! విన్నావా ? మహాసేనానులవారి యంతికమునుండి రైభ్యసగోత్రుఁడైన కాంచుకీయుఁడు వచ్చినాడట ! పూజ్యురాలైన అంగారవతి పంపున వాసవదత్తా ధాత్రి వసుంధరకూడ వచ్చినదట ! ఇరువురు ద్వారమునందున్నారు.

ప : చాలా సంతోషం ! మనబంధువుల క్షేమసమాచారాలు వినటం కంటె కావలసిందేముంది !

ఉ : చాల చక్కగమాటాడితివి. వాసవదత్త బంధువులు నాకును

బంధువులేయని భావించితివి. పద్మావతీ! రమ్ము కూర్చుం డుము! ఎందులకు సందేహింతువు ?

ప: నన్ను సమీపమందుంచుకొనియే ఆర్యపుత్రులు వీరికి దర్శన మిస్తారా ?

ఉ: అట్లు చేయుటలో దోషమేమున్నది ?

ప: ఆర్యపుత్రులు మఱియొకతెను వివాహమాడినారని చిన్నబుచ్చు కొంటారేమో !

ఉ: కాదు కాదు. పత్నీ సందర్శనార్హులైన బంధువులకు పత్నీ సందర్శనము కలిగించలేదనే మహాదోషము నాపై నారోపించెదరు. అందువలన నీవు కూర్చుండక తప్పదు.

ప: ఆర్యపుత్రుల ఆజ్ఞానుసారమే! (కూర్చుండి) చూడండీ! పూజ్యులైన అమ్మగారూ నాన్నగారూ ఏమంటారో అని ఆందో ళనగా ఉన్నది.

ఉ: పద్మావతీ! నీమాట నిజమే! ఏమందువా-

*వంచన చేసి తీసికొని వచ్చితి వాసవదత్త, నగ్ని శ*
*ర్పించితి చేతులార, ఇపు డేమని పెద్దలు మందలింతురో*
*యంచు మనమ్ము సందియము నందెను, తండ్రికి నాగ్రహంబు తె*
*ప్పించిన ధూర్తుఁడౌ దుడుకు బిడ్డని కైవడఁ దల్లడిల్లెద న్.*

ప : కాలమాసన్న మైనప్పుడు కాపాడుకోటానికి మనం సమర్థులం కాముగదా !

ప్రతీ : ప్రభూ ! వారు ద్వారం వద్ద ఉన్నారు.

ఉ : వెంటనే ప్రవేశపెట్టుము.

ప్ర : మహా ప్రసాదము !

[నిష్క్రమించుచున్నది]

[అంత కౌండిన్యుఁడును, వసుంధర ప్రతీహారి ప్రవేశించుచున్నారు.]

కౌండి : ఆహా !

ప్రాణము లేచివచ్చె ప్రియ బంధువ రాజ్య మిదంచు బిడ్డ ని
ర్యాణ కథల్ తలంచుకొని నంతన గుండెలు బ్రద్దలయ్యెఁ; మా
ప్రాణ సమానమైన నరపాల సుతన్ బ్రతికించి, పాప సో
పానము రాజ్యమే పరుల పాలొనరింపక పోతివా విధీ !

ప్ర : అదుగో మహారాజుగారు ! సమీపించండి !

కౌం : (సమీపించి) జయము జయము మహారాజులకు !

వసుం : జయము జయము ప్రభువులకు !

ఉ : (సగౌరవముగ) ఆర్యా !

మనుజ విభులకు మదయాస్తమయము తెవని
హాసమును చంద్రహాసము నాచరించు;
అతఁడు కుశలమే? మా వియ్య మంచుకొన్న
శాంతమూర్తి మహాసేన చక్రవర్తి.

కాం : చిత్తము! మహాసేనులవారు కుశలముగనున్నారు. ఇచ్చటి మీ అందరి కుశలము నడిగినారు.

ఉ : (సింహాసనమునుండిలేచి) మహాసేనులవారేమని సెలవిచ్చినారు?

కాం : వైదేహీనందనుల కీ వినయము యుక్తమే! కాని మహాసేనుల వారి సందేశము కూర్చుండియే వినవలెను.

ఉ : వారి యాజ్ఞ శిరోధార్యము. (కూర్చుండును)

కాం : మహాసేనులవారి సందేశమిది- శత్రుహస్తగతమైన సమస్త రాజ్యము సౌభాగ్యవశమున మరల మీకు సంప్రాప్తమైనది, చాల సంతోషం—

పుట్టు దుత్సాహమే పాఱుబోతులందు
మందబుద్ధులయం దసమర్థులందు,
జగతి నుత్సాహవంతులౌ సజ్జనులకె
భోజ్య మగు నెందు ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మి!

ఉ : ఆర్యా! ఇదంతయు అవంతీశ్వరుల యనుగ్రహమే! ఏమందురా—

చేతంజిక్కిన నన్ను తండ్రివలె వీక్షించెన్, కృతఘ్నుండనై
కూతుంగ్రైకొని లేచివచ్చిన మదింగోపింప డయ్యెన్, యథా
రీతిన్ మన్ననచేసె నన్ వినియు తద్వృత్తాంత, మీనాఁడుపు
ద్యోత ప్మాపతి కాదె కారణము సద్యో రాజ్య సంప్రాప్తికిన్.

కాం : ఇది మహాసేనుల వారి సందేశము. ఇక మహారాణీ అంగార వతి యంపిన సందేశ మీ వసుంధర వచింపగలదు.

ఉ : అమ్మా!

అంతిపురిలోని పదునార్వు రండు నగ్ర
గణ్యురాలు, ప్రజల్ గొల్చు ఘణ్యురాలు,
మా ప్రవాసంబు నోర్వని మాతృదేవి,
ఉజ్జయినిలో సుఖంబుగా నున్నదమ్మ!

వ : ఆరోగ్యవంతురాలైన మా మహారాణి దేవరవారి కన్నివిధముల సేమమును అడగమన్నారు.

ఉ : మా కుశలము ఈ విధముగా నున్నది.

వసుం : దేవరవారీవిధంగా దుఃఖముతో క్రుంగిపోవటం ధర్మంకాదు.

కాం : మహారాజుగారు మనస్సు నిబ్బరించుకొనవలెను. ఆర్యపుత్రులచే ఇంతటి అనురాగముతో ననుక్షణము స్మరింపబడెడి మా రాజపుత్రి మృతురాలయ్యును బ్రతికియున్నదే. ఆమెకై శోకింపకుడు—

మరణ మరుదేర మనుప సమర్థుఁడెవఁడు ?
త్రాఁడుతెగిపోవ ఘటమును తోఁడునెవఁడు ?
తానలో పెట్లఘాతి లోకమ్మురీతి
విరుగుచుండు యథావిధిఁ బెరుగుచుండు.

ఉ : ఆర్యా : ఈవిషయము మాత్ర మటువంటిదికాదు-

ఆ మహాసేన రాజేంద్రు నమ్ముఁగు బిడ్డ
స్నేహమయురాలు నా ప్రియ శిష్యురాలు
వలచి వలపించుకొన్న లావణ్యసీమ
యశపురా దామె జన్మ జన్మములకైన.

వ : మా మహారాణి ఈవిధంగా చెప్పమన్నారు. మా తల్లి వాసవదత్త వెళ్ళిపోయింది. మాకు పాలకగోపాలకు లెటువంటివారో అటువంటివాఁడవే నీవు. మొట్టమొదటనే నీవు అల్లుఁడవు కావలెనని అభిలషించాము. అందుకనే నిన్ను ఉజ్జయినికి రప్పించుకొన్నాము. వీణావ్యపదేశంతో అనగ్ని సాక్షికంగానే నీకు అమ్మాయిని అప్పగించాము. చంచల మనస్కుఁడవైన నీవు మా అభిప్రాయం గుర్తించక పెండ్లికాకుండానే పెండ్లికుమార్తెను తీసికొని వెళ్ళిపోయినావు. అనంతరం మేము మీ ఇరువురి ఆకారములు గీయించి ఆ చిత్రఫలకములకే వివాహ మహోత్సవము జరిపించి మా ముచ్చట తీర్చుకొన్నాము. ఆ కల్యాణ చిత్రమును నేఁడు నీకు పంపుతున్నాము. దీనిని దర్శించి చింతాక్రాంతమైన నీ స్వాంతమునకు కొంత ఊరట కల్పించుకొనుము.

ఉ : ఆహా ! పూజ్యురాలు అంగారవతీదేవి సానుభూతి సందేశము సౌహార్ద సమన్వితముగా నున్నది !

వందలకొలంది రాజ్యముల్ వడయుకంటె
దేవి సందేశ మధికసంతృప్తి నొసగె
సాపరాధులమైన మా యందు కూడ
తరిగిపోలేదు మాతృ వాత్సల్యమింత ?

ప : ఆర్యపుత్రా ! చిత్రఫలకంలో ఉన్న అక్కగారిని ఆలోకించి నమస్కరించాలని మనస్సు తొందరపడుతున్నది.

వ : అభ్యంతరం ఏమున్నది ! రాకుమారీ రండి ! ఇదిగో చూడండి !

[వాసవదత్తా చిత్రఫలకమును చూపించుచున్నది.]

ప : (చూచి. స్వగతము) ఇదేమి ? ఈమె యాకారమూ పూజ్యురాలైన ఆవంతిక యాకారమూ చక్కగా సరిపోతున్నవే (ప్రకాశము) ఆర్యపుత్రా ! ఇది అక్కగారి యాకృతికి సరియైన ప్రకృతియేనా ?

ఉ : సరియైన ప్రకృతియేమి ! సాక్షాత్తుగా వాసవదత్తయే యీమె !

ఇట్టి లావణ్య లహరిపై నెట్లుపడియె
కాలపురుషుని ప్రళయ భీకర కరాలు !!
అగ్ని కాహుతియై భస్మమగుట యెట్లు
మధురమోహన మీ ముఖమండలమ్ము !

ప : ఆర్యపుత్రుల చిత్రముకూడ ఆలోకించిన అనంతరం ఈ చిత్రం
అక్కగారిది అవునోకాదో నిర్ణయిస్తాను.

వ : చూడండి : రాకుమారీ :

[ఉదయన చిత్రఫలకమును చూపుచున్నది.]

ప : (చూచి) ముమ్మూర్తులా ఆర్యపుత్రుల ప్రతికృతియే : అందువల్ల
ఇది అక్కగారి చిత్రమనటంలో అనుమానం లవలేశమూలేదు.

ఉ : దేవీ : ఈచిత్రములను దర్శించినది మొదలు, నీలో సంతోష
సంతాపములు పొంగులెత్తుచున్నట్లు తోచుచున్నది. ఇందులకు
కారణము ?

ప : ఆర్యపుత్రా : ఈచిత్రములోని రూపరేఖలుగల స్త్రీ ఇచ్చటనే
ఉన్నది.

ఉ : ఏమి : వాసవదత్తారూపరేఖలు గల వనితా శిరోమణియా :

ప : ఔను :

ఉ : ఐనచో వెంటనే తీసికొనిరమ్ము :

ప : ఆర్యపుత్రా : నా కన్నె వయస్సులో ఒక బ్రాహ్మణుఁడు నా
సోదరియనిచెప్పి ఒకమ్మాయిని నావద్ద న్యాసంగా ఉంచివెళ్ళాడు.
ఆమె ప్రోషిత భర్తృక. అందువల్ల అన్యపురుష సందర్శనము

అంగీకరింపదు. కనుక ఎప్పుడైనా నా వెంట ఉన్నప్పుడు ఆమెను ఆర్యపుత్రులు అవలోకింపవచ్చును.

ఉ : (స్వగతము)

*ఆమె విప్రసహోదరి యనుటవలన*
*దేవి కాదన్న విషయము తేలిపోయె;*
*దానికేమి లోకమ్ములోఁ గానవత్తు*
*రొండొరుల పోలికలు గల్గి యుండువారు.*

ప్ర : (ప్రవేశించి) జయము జయము ప్రభువులకు! ఎవరో ఉజ్జయినీ దేశపు బ్రాహ్మణుడట! పూర్వము రాజకుమారి చెంత న్యాసముగా దాచిపోయిన తన సహోదరిని తిరిగి తీసికొని పోవుటకు వచ్చినాడట. ద్వారముదగ్గర వేచియున్నాడు.

ఉ : పద్మావతీ! ఆ బ్రాహ్మణుఁడే యైయుండునా?

ప : కావచ్చు!

ఉ : (ప్రతీహారితో) అంతఃపురోచిత మర్యాదతో నా విప్రుని వెంటనే ప్రవేశపెట్టుము.

ప్ర : చిత్తము! (నిష్క్రమించును)

ఉ : పద్మా! నీవుకూడ నామెను తీసికొనిరమ్ము.

ప : చిత్తము. (నిష్క్రమింతురు)

[అంత పరివ్రాజక వేషధారియై యౌగంధరాయణుఁడును
ప్రతీహారియును ప్రవేశించుచున్నారు.]

యౌ : (స్వగతము) ఆహా !

*స్వామి హితార్థమై పరమ సాధ్విని దేవిని దాచి, శేముషీ*
*శ్రీ మహితుండనై తగిన సేవయొనర్చితి, రాజ్యలక్ష్మికిన్*
*సేమము సేకురెన్, శ్రమకు సిద్ధిలభించెను, గాని తోఁడు నేఁ*
*డేమనిదెప్పునోయనుచు నెంతయు స్వాంతము సంశయించెడిన్*

ప్ర : అరుగో మహారాజుగారు ! సమీపించండి !

యౌ : (సమీపించి) జయము జయము !

ఉ : (స్వగతము) ఈ కంఠస్వరము మున్నెన్నడో విన్నట్లే యున్నది. (ప్రకాశము) బ్రాహ్మణోత్తమా ! మీ సహోదరిని పద్మావతి దగ్గర న్యాసముగా నుంచినమాట యథార్థమేనా ?

యౌ : చిత్తము ! యథార్థమే !

ఉ : (ప్రతీహారితో) అట్లయిన తత్క్షణమే ఈయన సోదరి నిటకు తీసికొనిరండు.

ప్ర : చిత్తము !

(నిష్క్రమించును)

[అంత పద్మావతియు, ఆవంతికా వేషధారిణియగు వాసవదత్తయు ప్రతీహారియు ప్రవేశించుచున్నారు.]

ప : అమ్మా ! రండి రండి ! మీకు ఒక తియ్యని వార్త వినిపిస్తాను.

వా : (కుతూహలముతో) ఏమి చేమిటది ?

ప : మీ అన్నయ్యగారు వచ్చినారు !

వా : ఎంత అదృష్టం ! ఇప్పటికైనా మా అన్నగారికి గుర్తువచ్చాను.

ప : (మహారాజును సమీపించి) జయము జయము ఆర్యపుత్రులకు ! ఇదిగో న్యాసము !

ఉ : పద్మావతీ ! ఈ న్యాసమును బ్రాహ్మణునకు సమర్పింపుము. న్యాసమును సాక్షుల సమక్షమున సమర్పించుట సమంజసము. పూజ్యులైన ఈ కాంచుకీయుఁడును వసుంధరయు నీ విషయమున సాక్షులు కాఁగలరు.

ప : బ్రాహ్మణోత్తమా ! ఇదిగో మీ సహోదరి: స్వీకరించండి !

వ : (ఆవంతికను పరిశీలించిచూచి) వాసవదత్త ! వాసవదత్త ! అవంతిరాజకుమారి ! వాసవదత్త !

ఉ : ఏమి ? మహాసేనకుమారియా ! దేవీ ! నీవు పద్మావతితో నంతఃపురమును ప్రవేశింపుము.

యౌ : అట్లుకాదు ! ఈమె నా సోదరి అవంతిక !

ఉ : కాదు కావయ్యా బ్రాహ్మణుడా ! ఈమె మహాసేన పుత్రి వాసవదత్త !

యౌ : ఓ మహారాజా ! ఇదేమి యన్యాయము !

*భారత వంశవార్ధి హిమభానుసమానుఁడవే ! సదా సదా*
*చారశుచిస్మితుండవె ! విచారవినీతుఁడవే ! పవిత్ర సం*
*స్కారముఁగల్గు ప్రాజ్ఞుఁడవె! చాలునిటుల్ వరకాంతలన్ బలా*
*త్కారముగా గ్రహించుట అధర్మము ! ధర్మపథైకరక్షణా !*

ఉ : అట్లయినచో రూపసాదృశ్యమును పరీక్షించి నిరూపించెదము. మేలిముసుఁగును దీయింపుఁడు

యౌ : (పరివ్రాజక వేషము పరిత్యజించి) జయము జయము దేవర వారికి !

వా : జయము జయము ఆర్యపుత్రులకు !

ఉ : (ఇరువురను పరిశీలించి చూచి) ఆహా ! ఎంత అదృష్టము వీరు మహామంత్రి యౌగంధరాయణులా ? ఈమె మహాసేన పుత్రి వాసవదత్తయా !

ఇది యథార్థమొ స్వప్నమో యెఱుఁగ, మరల
కాంత కందోయిముందు సాక్షాత్కరించె;
చెలియ యిటులనె కానవచ్చినది యున్ను
చేతి కందక మోసపుచ్చినది నన్ను !

యౌ : ప్రభూ! ఇంత పర్యంతము దేవిగారిని దాచియుంచి తమకు ఎంతో అపరాధము చేసినాను. ప్రభువులు నన్ను మన్నింపవలెను.

[పాదములపైఁ బడుచున్నాఁడు.]

ఉ : (లేవదీసి) మహామంత్రి యౌగంధరాయణులు రాజభక్తిపరాయణులు! మీ ప్రజ్ఞావిశేషము లనన్యసామాన్యములు.

*మాయలమారి తంత్రములు మంత్రము లెన్నొ యథోచితమ్ముగాఁ*
*జేయుటెగాదు, యుద్ధములు సేయుటగా; దొక పిచ్చివేషముల్*
*వేయుటెగా దహర్నిశము వేయివిధంబుల సాయమై, మహా*
*పాయనిమగ్నులన్ మము నుపాయము పెంపున నుద్ధరింపరే!*

యౌ : ప్రభువుల యదృష్టరేఖలే మాకు మార్గదర్శకములు!

ప : ఈమె పూజ్యురాలైన వాసవదత్తాదేవియా? అమ్మా! మిమ్ము సఖీజనంతోపాటు సామాన్యంగా చూచాను. మర్యాద తప్పి నడచిన మీ సోదరిని క్షమించండని పాదములు పట్టుకొని ప్రార్థించుతున్నాను.

[నమస్కరించును.]

వా : (పద్మావతిని లేవనెత్తి) సోదరీ! లెమ్ము! సౌభాగ్యవతివికమ్ము! అర్థించినంతనే నాకు ఆశ్రయమిచ్చి రక్షించినావు. నీ మేలు మరవలేను.

ప : మహాప్రసాదము ;

ఉ : మహామంత్రీ ! దేవిని మరుగుపఱచుటలో మీ యుద్దేశ మేమి ?

యౌ : కౌశాంబీ రాజ్యసంరక్షణము !

ఉ : బాగున్నది. మఱి మగధరాజపుత్రి యొద్ద వాసవదత్తను న్యాస ముగానుంచుటలో మీ రాసించిన ప్రయోజనము ?

యౌ : మహాబలశాలియగు మగధేశ్వరునితో వియ్యమును నెయ్యమును. పూజ్యులైన పుష్పక భద్రాది దైవజ్ఞులు ప్రభువుగారికి పద్మావతి భార్యకాగలదని వాక్రుచ్చిరి.

ఉ: ఈ సంగతి మన రుమణ్వంతునకుఁగూడఁ దెలియునా ?

యౌ : ప్రభూ ! ఇందులో నందఱము తోడిదొంగలమే !

ఉ : ఆహా ! రుమణ్వంతుఁ డెంత మాయలమారియైనాడు ! ఏమియు నెఱుఁగనట్లే నటించినాఁడు.

యౌ : ప్రభూ ! వాసవదత్త కుశలవార్త నివేదించుటకు పూజ్యులైన వసుంధరావైభ్యులను ఈ దినమే ఉజ్జయినికి పంప వలయును.

ఉ : కాదు కాదు! పద్మావతీసహితముగ మనమందఱమును గలిసియే పోవుదము ?

యౌ : మహాప్రసాదము !

[భరత వాక్యము]

రక్షణ మొనర్పుగాత ! మా రాజసింహ
చక్రవర్తి, యేకచ్ఛత్ర సమ్మితముగ
పశుపదధి వేల్లితము, హిమశైల వింధ్య
కుండలమ్ముగ వసుమతీ మండలమ్ము !

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

స మా ప్త ము

